నాగరిక మేదివిప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం డగుచున్. 147

క. ఒకరిరువురు గా కందము, నకటా ఛాగంబుఁ గుక్క యని పోయెద రే
టికి బ్రమసి వేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వుకుందురు తత్త్వజ్ఞుల్. 148

వ. అని విహారణస్థఁదచ్ఛాగం బగుభాగంబు విడిచి విప్రుండు పూర్ణశరం బగుకాసా
రంబునకు స్నానార్థియై చనియె నప్పుడు ధూర్తులు ప్రహాసభాసమానాననులగుచు
నొండొరులకరంబు లప్పళించుకొనుచు నయ్యజంబుం జంపుకొని భక్షించి రట్లు
ప్రజ్ఞాశౌర్యధైర్యాదిగుణంబులు గలవారలు పరులకార్యంబుల విఘాతంబుసేసి
స్వకార్య ముద్ధరింతురని మఱియుఁ జిరంజీవి మేఘవర్ణు నాలోకించి. 149

క. తనలావుఁ జూచి మృతకా, కనికాయశరీరరక్తకణములు మేనన్
జినికిపటతటమునందిడె, చనుఁ డుపహతిరహితభూమిజాతంబులకున్. 150

క. అరిమర్దనుండు సరిప్రా, ద్దరుదెంచుం గెరలి తరలి హతశేషరట
త్కరటవ్రాతికటభజింతున్, హరుఁ డాపగవారిఁబోలె నాపగవారిన్. 151

వ. భజించి నీకార్య మార్యసమ్మతంబుగా నిర్వహింపం గలవాఁడనని పలికిన మేఘవ
ర్ణుండు లుంఛితగరుజ్జాలుం గావించి విస్రం బగు కాకజఠరాస్రంబుఁ జినికి యచ్చి
రజీవిని న్యగ్రోధాగ్రకోటరంబునం బెట్టించి సపరివారుండై నిరుపహతిస్థానం
బున కరిగె నాసమయంబున. 152

చ. అరుణగభస్తిబింబ మపరాద్రిఁ దిరోహితమయ్యెఁ బన్నగా
భరణి శిరోధిహాలహలభంగి నిజు ల్మెరసె న్విరోధిభీ
కరగతి నంతఁగాఁబరిగాఢమహీధరభూజమగ్గకో
టరములు నిర్గమించి వికటప్రకటాననము ల్మడింనుచున్. 153

క. అరిమర్దనుఁ డనుపబల, స్ఫురణోల్లోకములు ఘూకములు వటకరటా
హరణేచ్ఛఁ గదలి బహుపా, ద్ధరణీరుహ మాశ్రయించి తద్విటపమునన్. 154

క. కాకములు మెదలకున్నన్, ఘూకంబులు కర్ణఘోరఘూత్కారహతా
శాకులము లగుచుఁ గ్రమ్మఱి, పోకను నఱ్ఱిడుచున్నపుడ భూజమునన్. 155

క. మతివిదులకు నుచితమనూ, ద్యతనము సారంభుఁడయ్యు నాకృతకార్య
స్థితిఁ గడఁగనియునికి మహో, న్నతియని మను వానతిచ్చినాఁ డట్లగుటన్. 156

క. అనితలఁచి నిలిచి తీవిం, బనివడి చిరజీవి యేరుపడ నొకసెట్టం
బొనరించినఁ గ్రమ్మఱి పరి, మునుమై యుత్తోలులఁ జుట్టుముట్టె న్బట్టెన్. 157

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక యరుగుఁ గావున నతనిం
జుట్టమువలెఁ గొనిచని పతి, కట్టెదురం బెట్టి కౌశికంబులు నిలిచెన్. 158

క. దూరితగరుదుత్కరుఁడవి, ప్రారుణఘనలోహితాక్షతాకృతి నతనిన్
దేరికొనఁ జూచి గర్వస, మూరంభోక్తృ విరోధిమర్దనుఁ డనియెన్. 159

క. ఓరీ నీవెవ్వఁడ వీ, తీరేమిటికైతి వనిన ధృతిపెంపున నా
పేరు చిరజీవి యనిన య, పారగుఁ డాయన యులూకపతి కెఱిఁగించెన్. 160

క. ఎఱిఁగించిన మించిన ని, వ్వెఱ నిట్లను ఘూకలోకవిభుఁ డిట్లనుచే
తెఱఁగు చిరజీవి నిన్నఱ, మఱలే కకాకరాజు మన్నించుఁగదా. 161

వ. దివస్పతికి బృహస్పతియుంబోలె మేఘవర్ణునకు ముఖ్యప్రధానుండవు నీతిపథికుండవు ధన్యుండవు నీయట్టి కృతకృత్యునకు నిన్నిచదశ రాఁ నేర్చునొకో సర్వంబునుం జెప్పుమనిన జిరజీవి యరిమర్దను నాలోకించి. 162

చ. తన పెనుగాకిమూఁకల నదాటున నీభటకోటి ముట్టి కా
ననితఱిఁ జంపి చన్నమఱునాఁడు నృతేతరభృత్యవర్గము
ల్గనుకనిఁ గొల్వ నప్పిలిచి కార్యము వాయసభర్త వేఁడినన్
మనమునఁ గొంకులేక యరిమర్దనునిం గనుమంటి నాతనిన్. 163

చ. ఘోరబలుం డగాధతరుకోటరమర్గవిహారిరాత్రిసం
చారనిరంకుశుండు పటుశౌర్యధనుం డరిమర్దనుండు క్రూ
రోరగభంగిఁ జంపఁదలఁచుండఁగ నెవ్విధి నిద్రవచ్చు నీ
వారికి నీవు నెట్లుమనవచ్చు శుభంబు భజింపుమా యనన్. 164

క. అరిమర్దను నిటుఁగని మని, తిరిగినజమునోరు దన్నితివి నాబుద్ధిం
జరియింపు మనిన వాయస, పరివృఢుఁ డందులకు మండిపడి నానంకన్. 165

ఉ. చూచి హితప్రధానుఁ డనుమన్మదిఁ బెద్దయు నమ్మియుండు ని
న్నీచు విరోధిపక్షుఁ డని నేరనయో తుది నిశ్చయింప నిం
దీవెడుగొట్టు కాల్పిలిచె నేనిఁ జెఱుం బ్రతుకంచు నూఁచిపో
వైచి యులూకభుక్తికినవత్సలుఁడై విడిపించె మన్త్రిపైన్. 166

తే. ఎఱుక పిడికెడు ఘనమంను రదినిజంబు, నెరయునీమూఁకమున్నునన్నెఱుఁగుఁగానఁ
గనలి చంపక కొంపక గౌరవమున, దేవ నీపాదములమ్రోలఁ దెచ్చి నిలిపె. 167

తే. తోడిమంత్రులజాడ నాదుర్మదాంధుఁ, డాడిన ట్లాడ కుచితకార్యంబుఁ జెప్పి
సిగ్గు గోల్పోతినని చిరజీవిజాతి, బాష్పుఁడై చెప్పెఁ దనచేటుపాటుఁ బతికి. 168

క ఆవేళ ఘూకపతి నయ, కోవిదు లగుమంత్రివరులఁ గూర్చి ప్రభుత్వ
ప్రావీణ్యంబున నచ్చిర, జీవిచరిత్రంబుఁ బ్రీతిఁ జెప్పం దెలియన్. 169

తే. చెప్పి వాయసరాజన్యశేఖరునకు, మానసీయుండు ముఖ్యప్రధానుఁ డితఁడు

దీని కిత్యుదితెఱఁగు వేర్వేఱపలుకుఁ, డనిన నయదక్షుఁ డగు రక్తాక్షుఁ డనియె.

క. చేరినమృత్యువు రిపుఁ డ, క్రూరాత్ముఁడు చిక్కినపుడ కొంకక చంపం
గోరుట నీతివిధానము, వైరికి దయఁదలఁచువెఱ్ఱివాఁడుం గలఁడే. 171

సీ. ఇతఁడు వాయసధరాపతికి మాన్యుఁడు ముఖ్యదండనాథుఁడు నీతిధాముఁ డనుచు
నానతిచ్చితి నిట్టివానికి నిట్టిదుర్వ్యసంబు వచ్చుట వెఱగుగాదె
ప్రత్యర్థికర్మమర్మము లెఱుంగుటకు రాజ్యప్రతిష్ఠకు నిట్టిసాధుమతులు
విను నీచవేషమైనను బూని బద్ధవైరులలోఁ బ్రవేశించి చెలిమిఁ జేసి

తే. చిచ్చు దోలిపోచ్చి వృక్షంబుఁ జెఱచినట్లు, పొదివి నానాటి కభివృద్ధిఁ బొందిపిదప,
జెఱచి పోదురు వీనిరక్షింపనేల, చంపి రాజ్యంబు సేయు నిశ్శంక నధిప 172

క. అని రక్తాక్షుఁడు చెప్పిన, వినఁగూడక ఘూకభర్త విశ్రుతనయధీ
ధనదక్షునిఁ గ్రూరాక్షుని, గనుఁగొనుటయు నతఁడు మధురగతి నిట్లనియెన్. 173

క. శరణాగతురక్షించిన, పరహితచరితున కిహంబుఁ బరముం దురగా
ధ్వరఫలముం గలదనిరో, యరిమర్దన కావు మిమ్మహాచిరజీవిన్. 174

తే. అనుచు గ్రూరాక్షుఁ డాడిన నద్దివాంధ, వల్లభుఁడు విని దీప్తాక్షువంకఁ జూచి
నీకుఁ దోఁచినకార్యంబు నీవు సెప్పు, మనిన నంగీకరించి యిట్లనియె నతఁడు

క. క్రూరాక్షునినీతి సుధా, పూరం బరి యెట్టినుస్స్వభావుఁడు జంపం
గోరఁడు శరణాగతుఁ డన, ఘూ రాజును నీకుఁ దగవు గా నేర్చునొకో. 176

క. ఈరీతి నీతిగలిగిన, సూరిజనుం డేలచెఱుపఁ జూచుం జనతా
వైరి యగుదొంగబంటుప, కారము వృద్ధునకుఁ దొల్లి గావింపఁడొకో. 177

క. నావిని యరిమర్దనుఁ డురు, భావుని దీప్తాక్షుఁ జూచి ప్రభునీతికళా
సేవధి విన నింపయ్యెఁడు, నావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 178

చ. కుండినరాజధానివసుగుప్తుఁ డనంగఁ బ్రధానసార్థవా
హుం డఖిలార్థవంతుఁ డొకఁ డుండు నతండు ప్రియావియుక్తుఁడై
పండినమూర్తితోడ నగుపాటున కుంకువఁ దన్వి నొండుపో
నండజయాన రూపవతి యన్ముకలకన్యకఁ బెండ్లియాడినన్. 179

క. అలరుం బ్రాయపుఁగన్నుల, కలికికి ముదిమగఁడు బూచిగావున గవియ
న్దిలతైలమువలె నెనయక, తొలఁగుం జెలిసెట్టిఁ గన్నఁ దుప్పనమియన్. 180

క. వెతలం బొగులుచు నెట్టన, రతిగతికిం బిన్నపడుచ రారమ్మనుచుం
బతిమాలి పిలువ విన దది, పతిఁబట్టిన చెవుడు దన్నుఁ బట్టినభంగిన్. 181

మ. పలితశ్మశ్రుశిరోజరోగలతికోపఘ్నుం డనర్ఘంగురున్
వలియుగ్వక్త్రునితస్తతశ్చలితనిస్వస్థోత్తమాంగుం గర

స్థలయష్టిం బటలావృతాక్షు విగళద్దంతు న్వయోగర్వని
స్థలయోషిత్కుల మేర్పడం బరిహరించు న్బాలవానింబలెన్. 182

సీ. పాఱవేయుటెకాని భక్ష్యంబు లిచ్చిన వాతెర నంట దవ్వాలుగంటి
చించివైచుటెకాని చీరలిచ్చినఁ గటీరమునఁ గైసేయ దాఱంపులాడి
తొలఁగఁబెట్టుటెకాని తొడవులిచ్చిన సొంపుపస మేనబూన దప్పలుపచెలువ
మగుడనిచ్చుటెకాని మాడలిచ్చిన ముల్లెఁ గట్ట దాజగడాఁగ కలువకంటి
తే. యింటిముంజూరుపెండెలో నిడుటెకాని, పువ్వులిచ్చిన ముడువ దప్పొగరుమగువ
కుడిచి కూర్చుండి యిదియేమిగొడవఁజేసె, వార్ధకంబున నాసార్థవాహకుండు 183

ఆ. చెనఁటిభార్య పేరుఁ జెప్పగ పెఱబోటి, పేర సిగ్గుఁ దొలఁగఁబెట్టె సెట్టి
ముదిమినేడ రోఁత యిదె నాకవిటవిటీ, జాతివశ్యభేషజంబు లడుగు. 184

సీ. మొరడువంగిన సెట్టిముదుకకు జవరాలిమోము గానని వాని ముకురమయ్యె
నగ్గుభర్తకు నాఁతి వాతెర చండాలవాటినండిన పిండివంటలయ్యె
గొయ్యలూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు విపినమండలిఁ గాయువెన్నెలయ్యె
వయసుపోయిన బేరివానికి సఖిచన్ను గొండలందనిమానిపండులయ్యెఁ
తే. బలితునకుఁ గోకిలాలాపజలుగు లెలుఁగు, బధిరునకు నయిన సంగీతపాకమయ్యె
మొలఁతనీక్షించి గుఱ్ఱక్కిళ్ళుమ్రింగుఁగాని, సౌఖ్యమేమియు నెఱుఁగఁడజ్జరఠుఁడు.

చ. నెలకొకనాఁడు గట్టెదుర నిల్వఁగఁ జూచినవాఁడు గాఁడు పీ
నల కొకనాఁడు మాటవిన నోఁచినవాఁడును గాఁడు నవ్వులన్
వలపులఁ జల్లనొగ్గినవాఁడును గాఁ డతఁ డెందువాఁడు గాఁ
డలజవరాలితోడిరతి యందనిమ్రానిఫలంబు సెట్టికిన్. 186

వ. ఇట్లు సన్నిహితవిశేషవేదనాజాతఖేదంబున నారాటంబు బుట్టి యడియాసపస నుసు
రుఁ బరిత్యజింపంజాలక ఈలకఱచుకొని యెడతెగక నిగుడు నమందోష్ణనిశ్వాస
మాతరిశ్వంబున నధరపల్లవం బల్లలనాడ నతం డొక్కనాఁడు శయ్యాతలంబున
నొడలుపడవైచి దాసీజనంబులు తనకాచరించునూడిగంబులుఁ గోడిగంబులుం జేసి
కూడునీళ్ళకుం బాసి గాసిపడుసమయంబున రజస్వలాంభోజినీదివాసంగముక్రీడా
సంప్రాప్తదురిత ప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చినవిధంబున దపనుం డపర
గిరిఁ దిరోహితుం డయ్యె నయ్యెడ. 187

సీ. పిసవెఱ్ఱిఅంకుగుబ్బెతలతప్పులు దప్పదాల్చుట కిది కన్నతల్లియిల్లు
కడుపుకక్కుఱితిపిల్చుడుగను ముదిలంజె నఱుదుల కిది పిన్నవయసునుంచు
గడికన్నగాండ్రయక్కఱలకు నిలుచూఱ పోరువుసొమ్మిదనిది పూఁటకాఁపు.

కలవర్తకుల కన్నుఁగవఁ బాయునిద్రఁ గదలింపనిది నిమ్మకాయపుఁబుసు
తే. ప్రభకుఁ బాసినకుముదినీపత్త్రనేత్ర, రంజనంబున కిది విశుద్ధాంజనంబు
నాఘనాఘనకాళిమోన్నతి నహించి, కటికచీఁకటి జగమెల్ల గప్పుకొనియె. 188

తే. మానసాటవి నేర్చుమన్మథదవాగ్ని, బాహ్యసంచారమునకుఁ బాల్పడియె ననఁగ
దీపములు సాంద్రగేహమందిరములందుఁ, బ్రకరశిఖ లుల్లసిల్ల జూపట్టెనపుడు. 189

క. ఆరూపవతి సఖాగా, హారంబుల దృష్టిఁబొంది యపుడొకభంగిం
బోరామి ఘోరవనక, వ్యాఘ్రముపలె వృద్ధపతినివాసముఁ జొచ్చెన్. 190

తే. చొచ్చి చచ్చినవండాలుఁ జూచుచాడ్కిఁ, జూడఁ గల్లంత నోసరించుచు గృహాంత
కాంతభిత్తికఁ జెంతఁ గంకటికి నడుగు, బిటికి నీక్షించి యప్పటి పెద్దసెట్టి. 191

తే. విరహదహనగ్రహంబున విగ్రహంబు, కొలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నాగాబసుము నక్షీణవిభవు, భల్లకంపితభవు మనోభవుఁ దలఁచి. 192

ఉ. తేరె ధనుర్ధరు ల్పుతమి లెక్కకు మిక్కిలి యొంటు రెంటుగా
వారదరింతు రేటినెఱవాదితనం బదిరెంటు నొండుగా
నారసి వేయనేరవలదా మతినీవలె నెంతవింత యా
నీరజగర్భుఁ డుండుఁ గడునేర్పరకౌశల మెన్న మన్మథా. 193

ఉ. ఇంపున నన్యచాపధరు లేసినతూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయఁగఁజాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనము సేయు భవద్విశిఖంబు లెల్లగి
ర్తింపుదు నీదుచాప మువధీరితశంబరకాంచనాంబరా. 194

క. తీరనికోలపగయుంబలె, నీరమణీమణికి నాకు నెనయదు విరహాం
భోరాశి నెల్లుగడతు, న్వీరోత్తమ నన్నుఁ గూర్పవే కలకంఠిన్. 195

క. అని వెన్నునికొమరు మరు, న్వినతాముఁ విరహభయవిధమునుఁ గన
త్కనకమణినిచయచామరు, ననుఁ క్షత్రమరు దూఱి యతఁ డున్నంతన్. 196

తే. కుశలగతి మజ్జనములాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ
ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. 197

వ. అంత. 198

సీ. భవనదీపాహితభ్రమరపేటికవాలుఁ గాగ స్త్రీతలము ళ్ళగద్దగోళ్ళు
ములుదోరణముబట్టు మొలత్రాటికుఱువాఁడికైదువు దెసకట్టు కావుబొట్టు
జిలుఁగుకన్నపుఁగత్తి బలపంబు మొగమాయమందు తొలపుటాకు మైలగోఁచి
మడుపుటాకులు పోఁకపొడికాయ మోరచ్చు చెప్పులు భుజగవృశ్చికచికిత్స

తే. సుప్తివృద్ధికరౌషధక్షోద మసిత, వసనభంగంబు పెడతలవంకసికయుఁ
గాఱునును మేను నెత్తురికన్ను లమర, దూరితత్రాసుఁడపుడొక్క దొంగబంటు 199

సీ. వచ్చి త్రిమ్మరుతలవరులు గన్గొనకుండ బవరిచుట్టును బలపమున వ్రాసి
ముంచి కన్నపుఁగత్తి మొనకత్తిపెట్టించి యొయ్యనొయ్యన శిలలూడ దివిచి
వివర మేర్పఱిచి యావెంబడి బదములు నడపి నల్వంకలు దడవిచూచి
యలికిడిలేకుండఁ దెలిసి యిల్సొరఁబాఱి వాకిటిగడియ నెవ్వడిసడల్చి
తే. గాలిరాకుండ వెలుతురు గాకయుండఁ, గఱకుగఱబట్ట గన్నపుగండిగప్పి
యొడలిసొమ్ములు వేర్వేర నొలిచికొనఁగ, సరస కేతేర బరికించి జడదరించి 200

క. కచభరము విరియ హార, ప్రచయం బల్లాడఁబఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ, కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్. 201

సీ. యువతిసేసిన యపూర్వోపచారమునకు వెసమిన్నుముట్టి యమ్ముసలిసెట్టి
యిచ్చనచ్చెరువంది ముచ్చటయినను మొగము బీనిరక్కస దనుదాన వచ్చి
ననునిటు గౌఁగిలించినది నేఁడింతకుఁ గారణం బేమేనిఁ గలుగవలయు
ననిలేచి నల్వంక లరసి యొక్కెడ భయంకరహేతికరునిఁ దస్కరుని గాంచి
తే. యితఁడుపో మూల మీశుభస్థితికి ననుచుఁ, బెన్నిధానంబుఁ జూచిన పేదవోలె
నీరదోదయ మరసిన నెమ్మివోలె, సమ్మదంబంది యాపరాస్కంది కనియె. 202

క. పొడపుఱువుంబలె ననుఁ దన, కడకన్నులఁ జూడరోయుఁ కన్నులకలికిం
గడువేడ్కఁ గూర్చితిఁకనె, కడఁగలఁ డిటువంటిచెలిమికాఁ డారసినన్. 203

క. మానగుమహిజక్రోడ, స్థానంబున వెలుఁగుమదనదావానలకీ
లానివహము చల్లార్చెను, దీనిపయోధరము లద్వితీయచరిత్రా 204

క. చోరకుఁడవె యతిసమ్మద, కారకుఁడవుగాక తీర్చగలనే నీస
త్కారర్ణ మీభవంబున, దూరీకృతకలుష వడ్డితోడంగూడన్. 205

క. తనగృహమునఁ గలవాసో, ధనకనకము లెల్లనిచ్చెదన ధృతిమీఁదన్
గొని చనుమని యంజలిసే, సినఁ జోరుఁ డతిప్రసన్నచేతస్కుండై. 206

చ. నెఱయఁ జెలంగియున్న యతనిం గని యిట్లను సార్థవాహ యి
త్తెఱవ భవన్నియోగమునఁ ద్రిమ్మరదే యదికొత్తగాదె నా
మఱఁదివి నీవు చెల్లెలిచి మమ్మవలోకముఁ జేసికాదె బ
ల్వెఱపున నిన్నుఁజేరి పొదవెం దనచక్కనిసోగచేతులన్. 207

క. నీనిలయంబునఁ గలసొ, మ్మేనొల్లం బడుచుకరణ మిచ్చితిసిదినీ
తోనలగిన వేసారిన, చో నను మఱఁదలఁపు మలయుచుం బఱతెంతున్. 208

క. చెలియలనిచూడఁ గినిసిన, దలఁ గోయుదుఁ బతికి సమ్మదము గానిది య
వ్వలకేల హితులకేటికి, లలనామణి యిది మొదలై లఁగు నీయాజ్ఞన్. 209

వ. అని భయంబుఁ బుట్టించి కృతసత్కారుండై చోరుండు సార్థవాహు వీడ్కొని చని
యె నాసమయంబున. 210

సీ. రాజాస్యముఖతాంబూలరసవాసనల గ్రుక్కి నానుముక్కునబంటి యైనదనుక
ధరపయోధరసుధాధరరసంబునఁ జొక్కుఁ బంచబాణపిపాస పాయుదనుకఁ
జంచలేక్షణఘన స్తనగుళుచ్ఛకముల నలముహస్తగ్లాని వొదుగుదనుక
నాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు బొంది తాపము శాంతిఁ బొందుదనుకఁ
తే ప్రాయ ముడిబోయి కసరింకఁ బాటియుండు, పంటిచాల్పున సెలవేరుపడినయొడలి
పరుసు సెట్టన బీదచే పడినపగిదిఁ, గుటుకుగుబ్బెతవయసెల్లఁ గొల్లలాడె. 211

సీ. ఉదయవేళకుము న్నె నిదురమేల్కొనివచ్చి ప్రాణవల్లభుపదాబ్జముల వ్రాలు
వ్రాలి నిర్మలతరజ్వలనతప్తసువర్ణకలశోదకంబుల జలకమార్చు
జలకమార్చి సపత్వశర్వరీశాతపోత్తాలచేలంబులఁ దాల్పనిచ్చు
నిచ్చి పొచ్చములేక హేమపాత్రంబున నిష్టాన్నముల భుజియింపఁబెట్టుఁ
తే. బరిమళముఁ బూయుఁ గపురంబుసురటి విసరుఁ
బూవుదండలఁ జుట్టుఁ దాంబూల మిచ్చు
బడక సవరించుఁ జెటిపాటినడుగులొత్తు
వలముఁ గౌఁగిట నాతిచోరాతిభీతి. 212

ఉ. ఏరికినైనఁ జోరుఁడు సుహృత్తముఁడే యతఁడేలనే సెస
త్కారము సార్థవాహునకుఁ గన్గొన నిచ్చిరజీవితావకీ
నారికి ముఖ్యమంత్రియగు నైనను నీతిపరుండు గాన నే
తీరున నైన నిట్టిసుమతిప్రవరుం డశుభం బొనర్చునే. 213

క. అని దీప్తాక్షుఁడు చెప్పిన, విని యరిమర్దనుఁడు నీతివిభవవిలాసున్
వినుతాసువక్రనాసుం, గనుఁగొనుటయు నతఁడు కౌశికప్రభు మొగమై. 214

క. కంటకులు రిపులు దమలో, నొంటకపురిఁ బాసి యూర నొకఁడై విను మి
ట్లొంటిఁ గృశియింపుచుండుట, గెంటనిశోభనము గాదె క్షితిపా నీకున్. 215

ఉ. ఈతఁడు మేఘవర్ణునకు నిష్టము గల్గినవాఁడు సత్క్రియా
న్వీతుఁడు రాజకార్యపరినిష్ఠితుఁ డీతఁడు లేమి లేమిను
మ్మాతని కూర్చిత్తైకవిజయస్థితి నీ కితఁ డునికిఁ జేసి వి
ఖ్యాతివహించు శత్రుబలహైన్యము నీకు శుభంబు గాదొకో. 216

క. వైరులు రాయుట హితస, త్కారమునక యసువులిచ్చెఁ దస్కరుఁడు లఘు
క్షీరమహాగోద్వితయము, రాఁపున గృహికి బ్రహ్మరాక్షసుఁ డిచ్చెన్. 217

క. అనవిని యరిమర్దనుఁ డా, నన మలరఁగ వక్రనాసునకు నిట్లను ది
గ్వినుత నయప్రథ యొక్కథ, వినవేడుక యయ్యెఁ దెలుపవే నాకనుడున్. 218

వ. వక్రనాసుం డిట్లని చెప్పం దొడంగె. 219

చ. కృతవిదధీశ చెప్పెదఁ బరిగ్రహలబ్ధము భూరిదుగ్ధగో
ద్వితయము పాల్చి నొక్క జగతీసురు లోఁగిట దానిపంచ నా
మతి నొకటన్ హరించుటకు మందచరుం డనుతస్కరుం డలి
ప్రతినవకాలకూటరుచిబంధుర మైనయమాసఁ జీఁకటిన్. 220

క. నెప్పెఱుఁగక చనఁ గానల, నొప్పున నొక బ్రహ్మరాక్షసుం డరుగుచు నా
దెప్పరపుఁ ద్రుచ్చు నచ్చోఁ, దప్పక వీక్షించి యద్భుతధ్వనిఁ బలికెన్. 221

క. ఓరీ యిఱులూ బెడునీ, దారుణనిశ నెందుఁ బోయెదవు చెప్పుమా దు
ర్వారత్వర ననుటయు నల, చోరుఁడు డా బ్రహ్మరాక్షసున కిట్లనియెన్. 222

క. జయసిద్ధి యనుధరామరు, నయనంబునఁ గలదు గోద్వయము దాని నతి
ప్రియతం గొని చనునాతఁడ, నయిపోయెద నొంటి నిష్మహారాత్రమునన్. 223

ఉ. కందెనదాయచాయకొల కచ్చులమేళము లక్షగోళముః
ల్గుందెనమారునోరుపసిగొయ్యలదండులుపండ్లు లిట్టిరూ
పెందును జెప్పఁ జూప నరు దెవ్వఁడవీవని వేఁడినం దరా
స్కందికి బ్రహ్మరాక్షసుఁడు సత్యపురస్సరభాషనిట్లనున్. 224

క. ఈనిశ నిట నేవిప్రుని, ధేనువులం ద్రోలనీవు దివియుటకై చో
రా నేఁ డరిగెద వత నిన, తానకమునఁ జంపఁబోయెద న్బలలాశిన్. 225

క. నావిని చోరకుఁ డంతం, బోవక యనునిన్నిశీథమునఁ గ్రోధమునన్
భూవిబుధుఁ జంపఁబోయెదొ, కో వాఁ డెటువంటినేర మొనరించెనొకో. 226

క. కారణముఁ దెలుపుమన నల, చోరకునకు బ్రహ్మరాక్షసుండను రజనీ
చారపలాయనమంత్రక, శారూఢుఁడు గాఁడె యరయ నవ్విప్రుండున్. 227

చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబు లగాధనింబకో
టరములు మఱ్ఱిమానితొఱటల్ పెనురావుంతొఱ్ఱలు న్మహా
నిరవధితింత్రిణీమహిజనిర్వ్యథనంబులు తొంగిచూడరా
దరసిన బ్రహ్మరాక్షసుల కద్ధరణీసురుచేతిరాయడిన్. 228

క. మెఱమెఱసి యద్ధరామరుఁ, బఱిమార్పం బోవరాదు బ్రహ్మకునైనన్

మొఱఁగి నిదురించువానిది, తఱి యగుటం జంపఁబోయెదం బదమనుచున్. 229

వ. ఇరువురు చని యవ్విప్రగృహంబు ప్రవేశించి రందు బ్రహ్మరాక్షసుండు ప్రతిరోధి కిట్లనియె. 230

క. తొలుదొలుత నరిగి విప్రుని, బొలుపారం జంపి కడకుఁ బోయెద నాలోఁ
దఱఁకక నీ వరిగి నిరాకులవృత్తిం బసుల నాఁచికొనిపొమ్మొకటన్. 231

క. తీరిదియని చెప్పినవిని, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కను నీద
ర్వారంభ మెఱిఁగిరేని మ, హారభసము పుట్టు నీగృహంబున నకటా. 232

క. ఈనెఱి నలికిడిపుట్టిన, ధేనువులను ముచ్చిలింపఁ దిఱునె నాపూఁ
పైనతరువాత దూరము, గా నరిగినమీఁదఁ జంపు కాదన విప్రున్. 233

ఉ. నావిని బ్రహ్మరాక్షసుఁడు నన్నిటులాడఁగ నెంతవాఁడ వీ
లేవడి నిన్ను వేఁడ నవులేకలిగెం బొలుదొత్త నిద్ధరా
దేవునిఁ జంపెదం గనలు దీఱఁగనం చడరంగ దొంగయుం
బోవకు పోకు మం చతనిభూరితరధ్వని నడ్డగించినన్. 234

వ. అక్కలకలంబు విని బ్రాహ్మణుండు మేల్కనియె నప్పు డతనికి విశ్వాసంబుఁ బుట్టింపం దలంచి. 235

క. మును బ్రహ్మరాక్షసుం డి,ట్లను నఘా తావకీన మగుగోద్వయమున్
గొన నున్నత్రాసదీపితుఁ, డని చోరునిఁ జూపె నిజకరాంగుళికోటిన్. 236

క. చోరుండును బటురౌద్రా,కారుండై నినువధింపఁగా నదయుండై
చేరినక్రూరుం డితఁడని, యారాక్షసుఁ జూపె భూసురాధ్యక్షునకున్. 237

క. నేరముఁ దప్పించుకొనం, జోరుండును బ్రహ్మరాక్షసుండును దనతో
నీరూపునఁ జెప్పినముఖ, సారసరిపుమీఁద హాసచంద్రిక మెఱయన్. 238

క. ధరణీసురుఁ డిట్లను మీ,రిరువురు పరమాప్తు లనఘు లింపెవ్వరిపైఁ
గెరలెదము చనుఁడు గాథ,త్వరఁ గ్రమ్మఱ మీరు మీనివాసంబులకున్. 239

క. దీవింపనలవ దవనీ,దేవత లామోదవనధిఁ దేలిన శాపం
బీనలవ దలఘుసంతా,పావిలచేతస్కు లమ్మహామహులయినన్. 240

వ. బ్రాహ్మణద్వేషంబులేక బ్రతుకుం డని వీడ్కొలిపినం బోయి రాచోర బ్రహ్మరాక్షసవివాదంబు జయసిద్ధికింబోలె మేఘవర్ణ చిరజీవి సంవాదంబు నీకు నిస్తులకల్యాణంబుఁ జేయునని విన్నవించి వక్రనాసుండు వెండియు. 241

సీ. తనమేనికండలు దఱిగి డేఁగకు మేఁపి ఖగముఁ గావఁడె శిబిక్ష్మావరుండు
గరుడుని కాహారకబళమై నాగేంద్రవరుఁ బ్రోవఁడే మేఘవాహనుండు

నిజకళత్రద్రోహి నిర్దయాత్ముఁ గిరాతు మనుపఁడే నిర్ణిద్రమైత్రిపత్రి
శత్రుసోదరువిభీషణు సమిద్భీషణు రక్షింపఁడే తొల్లి రాఘవుండు
తే. సకలదిక్కామినీకుచస్తబకములకుఁ, దారహారకలాపమై తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది నిత్యమగుచుఁ, గంటె శరణార్థి మనుచుటకంటె శుభము.
సీ. అని వక్రనాసుఁ డిట్లాడుమాటలు విని యందఱి వేర్వేర నడుగుబుద్ధి
నపుడు దివాభీతనృపతివికారకర్ణునిఁ జూచి తోఁచిన ట్లనఘ నీవు
పోలినతెఱఁగుఁ జెప్పు మనుగాక యనునంత నెడసొచ్చి క్రూరాత్ముఁ డిట్టులనియె
నే కార్య మెఱుఁగుదు రిందఱు పలుగాఁత లఱచెద రవివేకి పగుటఁజేసి
తే. మంత్రులకు నైజములు మృదుమధురభణితులవి యథార్థీకరించి వాయసముఁ బెంచి
మేలుచెడిపోయెదవు సేన నేలచెఱిచె, దహితు నిర్జింపు నాబుద్ధి నాదరింపు 243
క. నేరము ప్రత్యక్షంబై, చేరువ నంసంగ సంతసిల్లి సజారన్
దార న్నాధూర్తుల రథ, కారుఁడు శిరసావహించుకథ యిది యయ్యెన్. 244
క. అనవిని యరిమర్దనుఁ డా, యన నాలోకించి యోనయాజ్ఞన యిది యె
ట్లనురాగంబునఁ జెపుమా, వినియెద నన నతఁ డులూకవిభునకు ననియెన్. 245
క. కేరళదేశంబున రథ, కారప్రముదానుతల్లి గల దవ్వికచాం
భోరుహముఖి యువజారో, దారవ్యసనంబులకు వల్లెత్రాడై మెఱయున్. 246
ఉ. జాయలకొంగుపట్టెడి యసభ్యులచేరువపంట యన్మథ
ప్రేరితకోటి కేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారులపట్టుగొమ్మ యుపవల్లభసంపదపాంథబృందము
దారయు పల్లవాంగణనిధానము దానివిలాస మారయన్. 247
ఉ. క్రొవ్వినచన్నుదోయి కసులుకు న్ననుబయ్యెదఁ దెల్పఁ జూచిన
న్రువ్వనఁ బర్వుచూపులదరు ల్చెదరం బటుపాంథమర్త్యుల
ద్రవ్వ మెఱుంగుమేనిచెలువం బెడఁజేయక చూడఁ గోడెకాం
డ్రువ్విళులూఱ నూర మెఱయు న్రథకారవధూటి నిటునన్. 248
చ. మెఱుఁగులఁ గ్రుమ్మరించుకనుమించులు త్రొక్కనిచోట్లు ద్రొక్కఁ గ్రి
క్కిఱిసినగుబ్బచన్ను లెడయీక విరోధుల జోక నొందఁ దో
క్లోఱయ నితంబబింబమున నొక్కొకయించుక జాఱఁగట్టఁగ
ట్రోఱపు ఘటింప నేగువలయుగ్మలి మారపుటేటిసీటికిన్. 249
శా. ఆస్పృత్తిస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిర్గ్రాహహామో
హావేశక్షుభితుండు గానివసుఁ డిష్టాహారసంచారని

ద్రోహైముఖ్యము లేనివాఁడు గృహకాంతాకాంతసంతానచి
స్తావైరాగ్యనిరతుండు గానిజనుఁ డెన్నఁడు లేఁడు లేఁ డొక్కఁడున్. 250

సీ. పలుమెఱుంగులు మోవిపై నటింపఁగఁ గేరి నవ్వు నొక్కొకసారి యవ్వనవ్వు
జారకర్ణగ్లాని చేర నారజముగా బలుకు నొక్కొకసారి పచ్చిపలుకు
ముఖదృష్టియునమర్మములు గ్రుచ్చి పారఁగఁజూచు నొక్కొకసారి చురుకుఁజూపు
గిలుకుమెట్టెలయంతు బెళుకుసంపాదింప నడుచు నొక్కొకసారి బెడఁగునడుపు

తే. పదనుగా జాజుచేసినపసిఁడితీరు, పోల్కిఁ జూపట్టు మాతికపోతలము
తమ్మరస మంటఁగలుచుబ్రాయంపుకలిమి, మురియు నొకసారి వల్లంగి మోహనాంగి.

సీ. ఏతెంతువనియు పొక్కఁడిపోయి మత్తాళిచూడ నాకట తొంగిచూడనయితి
చేసేఁత నప్రద యచ్చికబుచ్చికపుమాటలాడ నాతో మాటలాడనయితి
కమ్మోవిరుచులఁ జొక్కించి తింతియ ముద్దుగుమ్మగుబ్బలయొమ్ము గమ్మనయితి
నను నేకతమున రమ్మని యొప్పి రప్పించి తెలియ యేటికిఁ దప్పఁ దెలియనయితి

తే. నీనుఁ జరణానతుఁడనైతి నేత్రజితచకోరనన్నిచ్చలో నేఁటికోరనయితి
వందు రాత్మప్రపంచమునైనజారు, లెఱుఁగరు తాఁకైన నవ్వాడవది సెఁగూర్చి. 252

తే. పరుషటంకకుఠారసంభరణకరణ, జనితతాపరసక్లాంతశాంతికాంత
హస్తములఁ దేర్చునొక్కొక్క యవసరమున, శైత్యభైషజ్యమున దానిచన్నుదోయి.

క. కైసేసిబిడ్డపాపల, తో సందడిలేమి నొడలు నొడలుం బిఱుఁదిం
తేనికుచంబులు మెఱయం, గా సుందరి పోతబొమ్మగతిఁ జూపట్టున్. 254

క. చెలిచెలువు తెరవుకెసగుం, బలె నానాషథికభోగపాత్రంబై వ
ర్తిలుచుండ దానిచెడుపో, కలు చెలిసెం బతికిఁ గొంతకాలంబునకున్. 255

క. తెలిసి యొకనాఁడు వాఁడా, లలనాతిలకంబు తలతలం బట్టుకొనన్
వలయునని తలఁచి వెంగలి, కలికిం బరికించి నిర్వికారతఁ బలికెన్. 256

క. ఏలినయీకేరళీనర, పాలుఁడు నా కానతిచ్చెఁ బయనము చాలన్
గాలవిళంబన మోనుహి, తాలిం దెమ్ము సంబళముఁ గంబళమున్. 257

క. వేఱూరికిఁ జని యిట కై, దాఱుదినంబులకు వత్తు నద్దినము లా
ఱ్ఱాఱుసుమీ నీసంగతి, జాఱుట నాకనినయోష సంతోషమునన్. 258

సీ. చివురువాతెర యచ్చుసేయుఁబో వేఱూరి యొసపరిగానిపల్లొత్తుకెంపు
తమిగుబ్బచంటిపాళెముడగ్గుఁబో వింతగుమ్మచిమ్ముటవ్రేలిగోరి తాఁకు
మోముదామరతావి ముదమందుఁబో క్రొత్తబాఁజుఁగుకస్తురిచుక్కబొట్టుతేఁటి
చిన్నారిమేనవాసించుఁబో పొఱుగింటికలికిచుట్టము యొమ్ముకమ్మపూఁత

తే. తనచొకాటపుఁజెక్కుటద్దములఁ బ్రతిఫ,లించుచుఁబో మాఱుమగనిక్రొమ్మించుమూపు
ప్రాఁతపోరాటమొంపారఁ బఱచెననుచుఁ బొంగ లాఁగ్యసీమ నక్లంగిలేమ. 259

క. తలపేనుపంటిసందిది, పులుకాలనుముల్లు నస్త్రమున యూకకటి
స్థలితీఁటపాదరక్షణ, శిలవోలెం బ్రాఁతమగఁడు చే పెవ్వొకీణ. 260

ఆ. నెరసుతోడఁబోలె నేత్రంబు దుర్భర, వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లుగతి వీనిఁ బాసి యి,చ్ఛానురూపవృత్తి నగుదు నేను. 261

క. అనిమూఁపులు మూఁడై లా,లనరథకారునకు సంబళము గంబళి వి
చ్చి నిలిచి కుహూనాత్రి గడ,ల్కొన నప్పుడనిలిచి పేరుకొని పతికనియెన్. 262

ఉ. నిక్కవ మూరికేగెదవె నీకు దయారహితాత్ముఁ డైనదా
జెక్కడఁగల్గె నిన్ను నొకయించుకనే పెడఁబాసి యుండలే
నిక్కడ నేను మోపిఱుఁద నిప్పుడవచ్చెదఁ దోడుకొంచుఁబొ
మ్మక్కఱదీఱ నాహృదయ మక్కట నీవశమాయెఁ బెఱుంగవే. 263

క. నిమిషము దివసంబై దివ,సము నెలయై మాసంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద, రమణా నీవదీయయోగరాహిత్యమునన్. 264

ఉ. ఈచెలువీకళావిభవ మీగుణ మీకమనీయవిగ్రహం
బీచతురత్వ మీగరిమ మేమగవారికి లేదు చూచితిం
జూచితిఁ బ్రాణనాథ నినుఁ జూచినకన్నుల కాంతాంతనా
రాచుఁడుఁ బట్టఁడీవు మగరాజవు రాజవు నిక్క మింతయున్. 265

ఉ. కేవలసాధనంబు లిరుగేల వహించి నటించుమన్మహో
భావజునట్లు మిక్కుటులిబాడిసయుం గొని నీవు మాముకీ
నావసథంబున న్మెలఁగ నచ్చరచాడ్పునఁ గన్నులార్ప కిం
పావహిలంగఁ జూతు దరహాసపరిస్ఫురితాననాబ్జనై. 266

క. విడిఁగలమాణిక్యము పు,త్తడితోడం గూర్చినట్లు తనతో నినుసాం
పడరం గూర్చిన బ్రహ్మను, దడయక చేమొత్తి మ్రొక్కెద మె ప్రాణేశా. 267

క. తడసినఁ జత్తు న్వడి ని,క్కడి కేతెమ్మనుచు ముచ్చ గన్నీరొలుకన్
బుడిబుడియేడ్పులతో న,వ్వెడమాయలప్రోవు మగనివీడ్కొల్పటయున్. 268

ఉ వంచనఁజేసి వాఁడు తలవాకిలి వెల్వడి పోయిపోయి య
స్తాచలకుంజకోటరమునం దినుఁ డేగినఁ డక్కబెట్టి యా
ముంచినచీకటి న్మసలి ముచ్చవలెం జొరఁబాఱి యింటిలో
మంచముక్రిందఁ దూఱుకొని మానముఁ గైకొనియుండె నంతటన్. 269

ఆ. జలములాడి మేనఁ గలపంబు నలఁది యచ్చెలువ చలువ వలిపెచీరఁ గట్టి
ముడిచి కడిఁది తేచి విడియంబు సేయుచు, మొదలియామమయిన యాద నెఱింగి.

ఉ. ఆ తెలిగంటిగంటె నెరసైన విభుం డరిగె న్నిరంకుశ
ప్రీతి రమింపవచ్చు నిటఁ బిల్వుము నీవని తోఁచిన దూతి యా
కేతకిఁ బోయి చీరనగ కీప్రతిరథ్యముసుం గొనర్చి సం
జాతకుతూహలుం డగుచు జారుఁడు దత్సదనంబుఁ జేరఁగన్. 271

ఆ. కోళ్లమూఁ డనున్నగొంగడిఁ బఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచు
తలుపువడల వరిగి చూచ్చుండె దాని క్రిం, దంటిమగఁడు డాఁగు టెఱుఁగలేక 272

చ. ప్రవిసుటితానురూపద్రుఘబంధ మసుంధర మోదకృద్ధా
వనము కటీకపోలముకుచ స్తనదృష్టనఖక్షతంబు కై
తవపరిహాసభాషితము తాంతచపేటము పాస్తసల్లజ్జము
ప్రనుపుడూహ ముల్లసిల సంగమ మిద్ధజను న్నిరాంత్యమై. 273

క. సాధ్వీయాకృతధారా, సాధారణకరశిఖరనిరాతనఖంబుల్
సాధింపఁగ రతినాథా, యోధనసాధనములు నయ్యె యువతులకున్. 274

క. ఆసతి యుపపతియును నిజ, మనసిం జెలరేఁగి యుల్లనారణగాఢో
ల్లసనమునఁ జెనఁగ గుసిక్రిల, నస నచ్చెలికాలు మగని వెన్నూఁగెయుటయున్. 275

క. దిటచెవక యాధరిత్రి, కటిమదిలో నిశ్చయించెఁ గనలున నీచిఁ
కటి నెక్కటి నిక్కడికం, కటి క్రిందిటు వచ్చె గట్టిగా మగఁ డనుచున్. 276

క. గతితృప్తిఁ బొంది యయ్యుప, పతి నాతిం జూచి పలికెఁ బడ్డముఖీ నీ
పతిరతిలో నారతిలో, మతిఁ దలఁపఁగ నీకు బ్రియతమం బెయ్యదొకో. 277

క. నోరార్పక నిక్కము జెపు, మా రామా ప్రేమ ననిన నది వానిదెసన్
గూరిమిఁ గలిగియు నలరథ, కారము నోరంజకంబుగా నిట్లనియెన్. 278

మ. *పతికందర్పరహస్యకేళికిఁ దలంప న్మానుషరోచ్చారణ
స్థితి ముంగొంగుపసింపె గాదె యది నాతిం బ్రీతిఁ జేకొంపఁగా
కతివాంఛాగతుఁ డైవి క్తిఁ దోఁజఁగంగాఁ జేయుజారుండు నీ
సతమే చెప్పుకు వానితోడిరతి నిస్సారంబు రాజాస్యకున్. 279

క. ఇదియేటిమాట యేలా, వదరెద నిను నీవెఱుంగవా నారమణుం
డుదధి బిఱుపడియు వీని, ల్లది నే ననపన్నఁ దెలియుదా నీమదికిన్. 280

క. రోఁత నినువంటి మానిసి, క్రోఁతికి నామగనిఁ బేరుకొనఁ జక్కడకున్

---

* ప్రతి ప్రాణేశరహస్యకేళికి నని పాఠాంతరము.

జేతికిఁ గలవాసి సుమీ, కాఁతాళము గాదు నీవు ఘనుఁ డౌతనికిన్. 281

ఉ. ఒంపన నేల నాపుని యొద్ద రమించుట యింద్రభోగమై
యుండునయో యనుంగువిభుఁ డూరికిఁ బోవు తెఱంగి యొంటి ని
ల్చుండఁగ వచ్చి పట్టికొని యోరిమురాత్మక సిగ్గుగొంటి నే
వెండియుఁ బోలె వేఁడి ఘటియింపవె నాకిటువంటి కూరిమిన్. 282

ఉ. రాచపను ల్వహించి చలరాచకుమారు నినంటి దేవుఁ డ
య్యో చని కాళ్ళతో నరిగె నూరికి నెన్నడు వచ్చువాఁడు తే
తే చవిగావు కంట్లు పెకలింపుచు నున్నవి ప్రాణవల్లభుం
జూచినదాఁక యొట్లు నిలుదుం దనువెట్లు సహించియుందుగన్. 283

శా. కాయం బెక్కడనుండెనేమి వనితాకందర్పుఁ బ్రాణేశ్వరుం
బాయం జాలవు ప్రాణము ల్వనుపు బ్బాపాళ్ళు గాఁ జేయుబల్
డాయన్ వ్వమ్ముఁగదా పయోధరము లంటం గౌఁగిటం జేర్చి యా
చాయం బైకొని చెక్కునొక్కరతిరాజ్యశ్రీలఁ దేలింపుగన్. 284

చ. అగునగు బైసిమాలి చిత్తినంచు విజృంభణవృత్తి నివ్విధి
న్నొగయని మాటలం జెవుల సూఁడకు సైఁచిన దానఁ గాను నా
మగనికి నిన్నువంటి కొలమాలిన మానుసు లీడె *భర్తతోఁ
దెగి యెడద్రెవ్వకం బ్రదికితే మని యైనవనై సుఖించెదన్. 285

చ. అనుతనుమధ్య భాషితము లారథకాఁడు సాదరంబుగా
విని యిది నా యెడం బ్రణయవిశ్రుతయౌ నటుగాక యుండినన్
నను ననుకూలుఁడంచు నుపనాథుని తోడ శతానవంబుల
న్వినుతి యొనర్చునే పరిభవింపక చంపక కాతు మెచ్చితిన్. 286

ఉ. ఏను బ్రవాసినౌ తెఱఁగి యింతట నంతట నాకుమా తెల
ర్లని దెఱంగి కన్గొని చలింపక వీఁడిలుసొచ్చి యుద్ధతుం
డై నిలుపోవలేక కదియుంబడెఁ గాఁతలు రోఁతలంచు ల
జ్జానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్. 287

ఉ. చిక్కితి వీనిచేత రొదసేయుట సిగ్గులచేటు పొందుఁ గం
జొక్కక వేగ నిల్వెడలఁ జూడఁడు మచ్చటఁ దీర్పకున్న నేఁ
డుక్కున నేమిసేయునో భయోదయ మయ్యెడునంచు నోడి యీ
చక్కెరముద్దుగుమ్మ సరసప్రియభాషల నింపొనర్చెడున్. 288

---

* భర్తకుం దెగి యెడద్రెవ్వనం బ్రదుకదే యని పాఠాంతరము.

క. అతివా నారతిలో నీ, పతిరతిలో నిష్టమెద్దిపలుకం దగునం
చితఁ డడిగిన హితరూపా, న్వితుఁడని నన్నబల పొగడె వీనిం దెగడెన్. 289

ఉ. వంచన యిప్పు డీతఁడు నవంకజనించె జనించుఁగాక యీ
చంచలనేత్ర నాయెడఁ బ్రసన్నమనోరథ దీనిమాటలన్
గాంచితి మోదమంచు రథకారుఁడు వేగ సజారదారతో
మంచము నెత్తికెత్తుకొని మంజుగతిం జని వాడవాడకున్. 290

ఉ. వాకొని యెంతశాంత యెటువంటిపతివ్రత యెంతయుత్తమ
శ్లోకవివేకరాశి యనుచుం బ్రియు నెన్నుచు హస్తతాళమా
నైకలఘుప్రచారగతి నాడెఁ బ్రహాసవిలాసవక్త్రులై
మూఁకలుగట్టి నాగరికముఖ్యులు తన్నరికించి నవ్వఁగన్. 291

వ. ఇచ్చరిత్రంబు సాపరాధుం డగుచిరంజీవిం జేపట్టిన నీ కుదాహరణం బగు నని రక్తాక్షుండు చెప్పిన నప్పలుకు లాదరింపక నులూకేశ్వరుం డూరకుండె నంత నయ్యభిప్రాయ మారసి. 292

క. తనకు నులూకత్రాసము, మనుగడ కుపహతి యును బహుమానత్వము లే
దని తెలిసి తెలివిఁ గలయా, వనమునఁ జిరజీవి ఘూకనాథుని కనియెన్. 293

క. నీరిపుచే నూరక యున, ధీరతఁ గాంచితి జగద్విదితమతి నయ్యున్
గ్రూరాగ్ని కాహుతిగ దను, ధారణ మిఁకఁ జాలు వేల్చెదం బ్రాణంబుల్. 294

క. నావిని రక్తాక్షుఁడు చిర, జీవిం బరికించి చచ్చి చేసెడుపనియే
మీవివరపుట్టఁ జెపుమా, నీవనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. 295

క. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి యులూకయోనిఁ బుట్టి బలిమి మైఁ
గాకముల గర్వరేఖా, స్తోకములం ద్రుంతు మనసుతుందుడుకు కాఁకన్. 296

వ. అనిన విని రక్తాక్షుండు. 297

క. లోకదృశఘనసమీరము, హాకునశరంబులనరింతు నని కాదాపూ
ర్వాకృతికి వచ్చె నొక్కతె, కాశికి నీకేల కౌశికత్వము గల్గున్. 298

క. అనురక్తాక్షునిఁ గనుఁగొని, ఘనుఁ డచ్చిరజీవి పలికె గాఢప్రజ్ఞా
ధన వినఁగోరితి నిక్కథ, యనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 299

సీ. కైటభాహితపదాంగదమార్తికచ్ఛాయ విధికమండలుసమన్వితమరాళి
మారారిమకుటమందారమాలికవియత్కృష్ణధేనుక్షురక్షీరధార
సాధుజీవంజీవచంద్రికసగరజస్ఫాటికస్వర్గసోపానపంక్తి
చిరతపోవిత్తసంచితభోగిరథకీర్తి వారాశిహృదయకర్పూరవర్చ

తే. పరుషహాసిక్తశాపసంప్రాప్యమాణ, మిత్రసహపుత్రగీర్వాణశత్రువేష
సముదితక్లాంతిహృతిసమ్యగమృతవృష్టి, గంగ పొంగడంగ నెగడు రంగత్తరంగ 300

సీ. తజ్జలంబుల నొక్కతపసి యాస్వాదింప శయపుటంబల్లనఁ జాఁపుఁబోలెఁ
దటకుటానిలనటద్విటపకాంచనిషణ్ణ ఘనగృధ్రచంచునిర్గళిత యగుచు
మూషికపడియె నమ్ముని దానినిజతపోమహిమ నొక్క మనోజ్ఞమహిళఁ జేసి
కన్నకూఁతునకంటెఁ గడుగారవంబునఁ బోషింప నొకకొన్ని పూఁటలకును

ఆ. గుఱులుగూడె మేను మెఱుఁగెక్కెఁ బాలిండ్లు, బయలు మెఱసెఁ బిఱుఁదుబలిసె నడలు
ముఱిపె మెఱిఁగె సిగ్గుమోమున నివురొత్తెఁ, దోయజాస్య కెలఁ బ్రాయమైన.

క. కలితరుచిమించునంచన, ఫలముంబలె నూఁగునూఁగుఁ బ్రాయము చెలిపై
నిలువం గని ముని మనుపి, వలవని తలపోసె నధికవాత్సల్యమునన్. 302

క. ప్రతినూతనర్తువేళా, న్వితయౌవ్వత యవ్వధూటి వ్రాపలి యగు న్ద
త్సతిపాణిగ్రహణముఁగా, మతిఁ దలఁపరు సుమతుల నభిమతమై యునికిన్. 303

వ. ఇంతపడుమున్న వివాహంబు సేయలేనైతి నిచ్చిపుచ్చుకొనువారికిఁ గులధనాది గౌరవంబులు సదృశంబులునయిన ననురాగంబు పెరుగు రూపయౌవనాదులు పరస్పరానురూపంబు లయియుండిన సతిపతులకుఁ బ్రేమాంకురంబులు వృద్ధిఁబొందుఁ గావున నివ్వనజగంధి మహానుభావుండగు సూర్యదేవునకుం బరిణయంబు సేసెద నని యమ్ముని తీవ్రధాము నాకర్షించి. 304

సీ. తనునోరఁ బేరుగ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాఁ డఘములు వ్రచ్చువాఁడు
పరరాజసంబాధ విరియుచక్రముల రక్షించువాఁ డిఱుల శిక్షించువాఁడు
వేదాంతశుద్ధాంతవీథుల నోలగంబుండువాఁ డాపద ల్చెండువాఁడు
దుష్టమందేహ సందోహంబు నెలగోలు తెరమువాఁడు మురారితెరనువాఁడు

తే. సంప్రదోషవచస్థ్సితిజలదరించు, ననిజనులకు దృష్టిపాటవము నిచ్చి
మించువాఁ డెల్లదిశల దీపించువాఁడు, సారసాప్తుండు మునికి సాక్షాత్కరించె.

చ. ముని యలతీవ్రధాముని సముజ్జ్వలధామునిఁ బూజసేసి యి
ట్లను దిననాథ యిక్కలయాధర పెంపుడుబిడ్డ నాకు నీ
కెన సుముహూర్తవేళ వరియింపుము నీకిదె యిత్తునన్న న
వ్వనరుహబాంధవుండు శ్రుతవంతుఁ బ్రశాంతునిఁ జూచి యిట్లనున్. 306

తే. అనఘ నాకన్నఁ బర్జన్యుఁ డధికుఁ డభ్ర, సంచయంబున నను నిరోధించుఁ గాన
నమ్మహాత్మున కీకన్య నఖిలమాన్యఁ, బరిణయము సేయు మదినీకుఁ బరమశుభము.

క. అనిచెప్పి తపనుఁ డరిగిన, ననఘుం బర్జన్యు నంత నాకర్షింపన్
జనుదెంచి నిలిచె నతఁ డ, మ్ముని యావ్వేల్పునకు నెయ్యమున నిట్లనియెన్. 308

క. కన్య న్నభవత్త్రయాస, న్నాన్య ననన్య న్వరింపుమా యిచ్చితి నీ
ధన్యత్వ మమర నన్ బ్రజ్ఞన్యుం డిట్లనియె మానిజనమాన్యునకున్. 309

క. మరుదభిహతిదూదిక్రియుం, దరలుదు నాకన్న ఘనుం డతం డాయన కి
త్తరళాక్షి నిచ్చి సంయమి, పర పెండ్లి యొనర్చు మనుచు వాఁడుం బోయెన్.

క. పవమానుఁ గ్రోధహతరై, పవమానుఁ దలంపఁ దపసిపాలికి నతఁ డా
త్స్వజవము లమరవచ్చిన, వివిధాతిథ్యములు గావింపుమఁ బలికెన్. 311

చ. ఉచితసభాయితాఖిలపురోపవనాపవనాసురాసుర
ప్రచయములందు నీసవతు రాఁ డొకఁ డిష్టజనప్రసన్నతా
రుచుల వరో త్తేజింగి గుణరూపవయోనయధన్యఁ గన్య నీ
కచలమునీష నిచ్చెద సదాధృతిఁ గమ్ము వివాహ మీవనన్. 312

చ నరులు సురల్ భవాద్యులు నన్ను మహోబలుఁడం డ్రు సత్కృపా
పరమపరమేష్ఠి శైలము లపారబలంబులు నేనెఱుంగుదుం
బరు లనమన్న నేమి కనుపట్టిన పట్టినరాధిభర్త కా
దరమున నిత్తుఁగాకని సదాగతి చెప్పి యథేచ్ఛ నేగినన్. 313

క. ధరములఁ దటఘటితపయో, ధరముల సంగీతముఖరదైవతవిద్యా
ధరముల శ్రీగరుడసుధా, ధరములఁ దలఁచుటయుఁ బర్వతము లేతెంచెన్ 314

క. ముని యద్ధరణీధరములఁ, గనుఁగొని యిట్లనియె నాత్మకన్య ననన్యన్
జనలోకమాన్య నిచ్చెద, గొనకొని యొండొకఁడు పుచ్చుకొనుఁ డింపెసఁగన్.

చ. అతిశుభలగ్న మీసమయ మన్న నమస్కృతు లాచరించి ప
ర్వతములు పల్కెఁ నేఁ డబలపంతులమందరు పాదజర్జరీ
కృతులము మమ్ము లెక్కఁగొన వెల్కలు వానికి నిమ్ము నిర్మల
వ్రతఫలదీయ ప్రీతి కనివారణ లేకని చెప్పిన పోయినన్. 316

క. ఎలుకలఁ బిలిచి మహాముని, కులవల్లభుఁ డనియె నిత్తుఁ గూఁతు న్మోదం
బొలయ పరియింపుఁ డొకఁడని, పలికిన నవి కరము వెఱఁగుపడి యిట్లనియెన్.

క. ఎలుకలకు మనుజసతులకుఁ, గలయిక లెట్లనిన మౌని కమనీయతపో
బలమునఁ గ్రమ్మఱఁ గూఁతురు, నెలుకంగాఁ జేసి యొకటికిచ్చెం బుచ్చెన్. 318

వ. అట్లగుటఁ గాకి పగునీకు ఘూకజన్మ మెట్లుగల్గునని కేరడం బాడి యధిక్షేపించు రక్తాక్షుని వారించి యరిమర్దనుండు ప్రసాదపురస్సరదృష్టిఁ జిరజీవి నాలోకించి.

ఉ. క్రూరతరావలోకములు ఘూకము లాదృతి నీకు నీప్సితా
హారము లిచ్చు నిర్భయుఁడవై ధరణీరుహదుర్గకోటరా

కారతఁ గాలకాంక్షఁ బొసఁగ న్నిజకార్య మొనర్పఁ గాంచిన
జ్యారవవేదదత్తగజసత్త్వభితాప్తహరిత్కరిస్ఫుర
ద్వీరుఁడు క్రీడి మత్స్యపురి నాఁడు బృహన్నలయై నటింపఁడే. 328

చ. ఒకవెసఁ గార్యదాహమున నుండక యేరికినైనఁ దీఱదం
తకనిభసత్త్వుఁ డాదరణధామకటాక్షుఁ డఖండవిక్రమా
ధికుఁడు విలాసవిభ్రమణదేశము మాద్రికిఁ దొల్తపుత్త్రుఁ డా
నకులుఁడు మత్స్యరాజఘననంబున సాహిణియై చరింపఁడే. 329

చ. భుజబలశాలి నీతిపరిపూర్ణుఁడు రూపవిలాసవారిజ
ధ్వజుఁడు హరిజ్జయాభిముఖవర్యుఁ డతిప్రియభాషుఁ డాశ్రిత
ద్విజనిధి కార్యదాహనిరతి న్నిజవేషముఁ గప్పిపుచ్చి గో
వ్రజములఁ గాచువాఁడయి విరాటుపురి న్సహదేవుఁ డుండఁడే. 330

ఉ. కాలము దాఁట నెవ్వరలఁ గ్గల్గలవారలు వారిరాశికీ
లాలపరీతభూతవిపులాన్వపరాజముఖీశిరస్స్థ
స్థాలఘురత్నభానునికపాతిసమున్నపదంఘ్రిపద్మ పాం
చాలతనూజ తొత్తువని సల్పదె దైవగతి న్సుధేష్ణకున్. 331

వ. అని చెప్పి బాష్పనిష్పీడితాక్షుండై వాయసాధ్యక్షుండు చిరజీవి నాలోకించి, 332

క. పరదేశ మఖిలదుఃఖా, కరము మదీయోపదేశగమ్యుఁడవై కా
ర్యరసమునకోర్చి రిపుమం, దిరమున నెబ్బంగి నుండితివి చిరజీవీ. 333

క. ఘూకములు వెఱవ ఘూక, క్ష్మాకాంతుఁడు గౌరవంబు సలుపఁగ ప్రతిప
క్షౌకమున నుంటి విద్దఱ, నాకతమున నీకుఁ గలిగెనా చిరజీవీ. 334

సీ. అని విన్నవయిన వాయసరాజు నీక్షించి యచ్చిరజీవి యిట్లనియె మఱ్ఱి
తరువున నీయాజ్ఞఁ దలమోచి యేనుండుతఱి మదాంధదివాంధతతులు వచ్చి
కెలఁకు లీక్షించి మీపాలకును లేమన్న తెరలివచ్చినత్రోవ మరలిచనఁగ
నున్నకన్నెఱిఁగి నేనొకశబ్ద మొనరించి క్రమ్మఱించితిఁ గార్యకరణబుద్ధి

ఆ. నప్పుడు వికృతమూర్తినైయున్నన న్నులూ, కములు గాంచియెఱుఁగుఁ గానఁదొలుత
నింపుకలిమి సంహరింపక నొంపక, నాదరమున భర్త కప్పగించె. 335

వ. అప్పుడు ఘూకవల్లభుండు నన్నుం జూచి నీ వెవ్వండవని యడిగిన మేఘవర్ణు నకు ముఖ్యదండనాథుండ నగు చిరజీవి నని చెప్పినతి నప్పలుకులు విని మంత్రులరావించి మంత్రకూటంబున నన్నుం జూపి యితని కుచితం బగు కార్యం బొకరొకరు చెప్పుండనిన నందు రక్తాక్షుండనువాఁ డొక్కరుండు దక్కఁ దక్కినవారందఱు నాపక్షంబ పలికిరి రాజును వారివాక్యంబు లంగీకరించి నీతిదక్షుం డగు రక్తాక్షుని

చెస నాదరణంబు సేయఁడయ్యెఁ గాలపక్వంబును నట్టిద. 336

క. జనియింపం గల కార్యము, మనమున దగ నిశ్చయించి మంత్రి సునీతిన్
వినిపించిన వినఁడొల్లని; చెనఁటికి ముకుబంటిగాదె చేటుం బాటున్. 337

తే. గగనమంటిన దోషాగ్ని గాఢశాంతి, నీరమున శీతలము సేయ నేర్చు మంత్రి
చిరహితారంభపరుఁ డైన సేవకుండుఁ, గార్యనిర్వాహకులు సూవె కరటముఖ్యా.

క. తా నెంత కార్యపారగుఁ, డైన రహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానకి నే కార్యంబుం, బూనం దగ దుద్ధత ప్రభుత్వ ప్రజ్ఞన్. 339

ఉ. ముప్పదిమూఁడుగోటుల సుమూర్తులవేల్పుల నేలు వజ్రియ
ప్పప్పయువార్యశౌర్యకరుణాదులపట్టున నింద్రుకేనియున్
జెప్పనివాఁడె యట్టి నయశాలి బృహస్పతి గోపనంబునం
జెప్పిన పంపుసేయక విశృంఖలవృత్తిఁ జరింప నేర్చునే. 340

క. కావున రక్తాక్షుఁడు నయ, కోవిదుఁ డమ్మంత్రి మాట గురుమంత్రముగా
భావింపలేక కోటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మంబయ్యెన్. 341

చ. అరయఁగ దుష్టమంత్రినివహం బను వారము గల్గియుండ నే
పురుషు ననీతిదోషములు పొందవు రోగము తే యపథ్యబం
ధురుఁ గలఁగింప వేజనునిఁ ద్రుంపదు మృత్యువు లక్ష్మి యెవ్వనిన్
జిరపదగర్వదర్పితునిఁ జేయదు పైకొనవేరి నాపదల్. 342

వ. లోభికిఁ గీర్తియు ఖలునకు మైత్రియు నష్టక్రియునకుఁ గులంబును ధనార్జనతత్పరు
నకు ధర్మంబును నలసునకు విద్యయు గృపణునకు సౌఖ్యంబును బ్రమత్తసచివప్రా
పకు జగతీపతికి రాజ్యంబును లేదు వెండియు నీరసేంధనంబుల వహ్నియు మూర్ఖు
లందు శోకంబును జపలచిత్తులయందు గోపంబును గాంతలందు విత్తంబును
దయావంతులందు ధర్మంబును మహాత్ములయందు ధైర్యంబును వృద్ధిఁబొందు నది
యట్లుండె. 343

క. వలనగు నంతకు బగతుం, దలనిడుకొని తిరుగు నీతితత్త్వజ్ఞుఁడు మున్
జిలువయొకం డట్టిదయై, పలుగందిన దే యనేకమండూకములన్. 344

క. అనిన విని మేఘవర్ణుం, డనురాగరసాబ్ధి నోలలాడుచు విద్యా
ఖనికా యొట్లీకథ చెప్పు, మను డచ్చిరజీవి వాయసాగ్రణి కనియెన్. 345

సీ. విను పూర్వమున మందవిదుఁ డను కాలాహి యాహారకాంక్ష నహర్ముఖమున
బఱచి యొండొకచోట బహుభేకకలకల ప్రతిభిన్నసకలదిగ్భాగమైన
హ్రదము గన్గొని లోనికరుగ నెద్దిక్కున దెసవు గానక తీరధరణి నిల్చి
కుంభిని ఫణమూదికొని డిల్లచెడినట్లు పరవశుగతి రుగ్ణుపగిది నుండఁ

తే. బలికె మండూకపతి మహోఫణివతంస, ప్రాణములు లోచనంబుల బడిలపఱచి
యెఱచి యొల్లక యిట్లుండ నేల నేల, చింతలేమిటి నేని భక్షింపరాదె. 346

క. తలద్రిప్పక మ్రింగుచు కే,వలము మహాబలుని యంతవాని నయోనీ
కలఁతంబడ నేకార్యము, గలిగెనో కో యన్నఁ బన్నగం బిట్లనియెన్. 347

తే. ఓదయానిధి దైవోపపాదితుండ, నైననాకేల దొరకునాహార మఱక
నోరులు వెట్టినదనుక బస్తుండవలయుఁ, దనకు నావుడు మఱియు నద్దర్దురంబు. 348

క. అనిలాశనవల్లభ చె,ప్పు నహో చిత్రంబు వస్తుపారణ లుండన్
వనరం గారణమున్నను, వినియెద జెప్పుమనిన నుంగవిదుఁ డిట్లనియెన్. 349

క. కేవల మాహారేచ్ఛం, బోవఁగ నొకనాఁటిరేయి భోగం బద్రువం
గావడి ద్రొక్కిన నొకభూ, దేవకుమారకునిఁ గఱచితిని బడలుపడన్. 350

క. కాటుపడి భీతిఁ గాయం, బూటాడంబరచి జనకునూరుద్వితయా
స్ఫోటితమస్తనుఁడై శిశు, వేటుపడినకురరివోలె నేడ్చుచునుండెన్. 351

క. అవలునలముద్దుపట్టిం, జడియకుమని వీపుజఱచి జనకుం డురముం
దడికొని మునుఁగడ పుడమిం గడునడకువ నున్ననన్ను గని కోపమునన్. 352

క. వసుధామరుఁ డిట్లను వెలి, విసరినతమినోరి విసపువిత్తానోరే
పసనాడెఁ గటకటా యి, క్కసుగంసుం గుంగులేక కరనన్ బంపన్. 353

ఆ. కుటిలగతికిఁ బుట్టుగుడ్డికి ననుదిన, శ్రుతివిహీనునకును గ్రూరమతికి
బాపజాతికెలప్రాపించుఁ బరహితా, చరణవిద్య నిన్ను సైఁపఁదగునె. 354

చ. కడుదొడుసైన యిద్దురితకర్మము నిన్గొని ముంచుగాక యె
క్కడఁ జననిచ్చుఁ బుట్టపురుగా కొఱగా కెపు డస్వతంత్రతన్
మడుఁగుభజించి భేకముల మస్తమున న్భరియించి కొల్చి యె
వ్వడవి దయామతిం గడుపు పోయఁగనుండు పాకారిసొమ్మునన్. 355

క. ధారాళచింత నంతం, గ్రూరతచెడి మిమ్ము మోచికొని తిరుగంగా
నోరాజా వచ్చితి నా,హారము మీరిడక లేదయా నాకనుచున్. 356

క. ఆరోహణకౌతూహల, సౌరభ్యము మోసులొత్త జలపాదుఁడు దు
ష్టోరగభాషణములు మా,యారూపము లనక నిజము లని తనలోనన్. 357

క. తలఁచి యలచిలువకిట్లను, నెలకొనినను గొలువనిలువ నీహృదయమునం
గలిగిన నాహారం బిడి, తలకుం గ్రొవ్వెక్క నడపెద న్నే ననుడున్. 358

ఉ. మందవిదుండు కప్ప దనమాయకు లోనయి చిక్కె నంచు నా
నందమునొంది భేకరమణభ్రమణాదులు నాకులేవు నీ

కంఠమునఁ జేరి భోగిఫలకంబున నీపదముల్వహించి యుం
దుం దుదిముట్టనందనుకఁ ద్రోవక డగ్గఱఁ జేర్చుకొ మ్మిటన్. 359

క. నను విశ్వసింపు మెప్పటి, కనుమానము మాను చచ్చునంతకు నెందుం
జననని దేవరనగరికి, దనపేరం గమ్మకస్తైదం గొనుమనుచున్. 360

ఆ కడుపుఁ జూపి చానగా నింక నెన్నఁడు, నడుపుకొనియె దనుచు చెనుగుఁబురుగు
చెప్పరాని ప్రియముఁ జెప్పినహృదయంబు,గరఁగి భేకరాజు తెరువుచూపి. 361

క. ఆరోహింపఁగవలె గృ,ష్ణోరగ యీసరియు వెంట నొద్దికిఁ జనుదె
మ్మా రయమున ననుటయు ని,ర్వారణనద సొచ్చి కదియ నచ్చెం గప్పన్. 362

క. అప్పు డనురాగమొప్పం, గుప్పలుగొని క్రోతిగొమ్మగొన్నట్లు వడం
గుప్పించి కప్ప లేఁడ, ప్పప్పఫణిప్రవరుభోగ మారోహించెన్ 363

క. జలపాదుని బాదుకొనం, దలనిడికొని త్రాఁచు నేచునటనం దటభూ
ములకొంతసేపు ద్రిమ్మరి, యలసినగతి నూరకుండె నట్లుండుటయున్. 364

ఉ. పన్నగభర్తఁ జూచి జలపాదుఁడు పల్కె నిదేమి వేగసం
పన్నము గాకయున్నయది మందవిదా భవదీయవిగ్రహం
బన్నభుజంగ మిట్లను దయామయ యాఁకటఁదీలుపడ్డ నా
కొన్నదె యానశక్తి కడు పోమినమీఁదటఁ జూడు చిత్రముల్. 365

క. దొరలు తమవేడుకల జూ,తురు గాని వహించి తిరుగు తురగంబులఁ బ్రో
వరు మేపునీళ్ళతటినిడి, యనుదివ్విధ మనిన దర్దురాగ్రణి మదిలోన్. 366

క. కలతెర గిట్టిద యనుచుం, దలఁచి యయో విప్రశాపదశ దనయిచ్చన్
వలసిన యాహారము గొన, గలుగమి నిచ్చలును నొచ్చెగద యకటకటా. 367

క. భారవహం బిదిలేదా, హారము నే నిడక కటికి యాఁకట నిపుడే
కారెదునిట్లుండిన నా, యారోహణ కేళి యేక్రియం గొనసాగున్. 368

చ. అని తలపోసి మందవిదు నారసి యజ్జలపాదుఁ డిట్లనున్
ననుఁ దలఁదాల్చి యాడజవనంబునలెం జఠరానలంబురాఁ
జిన యపుడెల్లగప్పల విశృంఖలవృత్తి భుజించి లావుగై
కొని విహరింపుభోగికులకుంజర నాదములన్ హ్రాదంబునన్. 369

వ. అని నిరప్పణగాఁ గప్పలఱేఁడు సెలవిచ్చిన బలవంత మగుట నీరంబున నవర్గళ
ప్రచారంబునం బేరెంబులు వాఱుచు నొడిసియొడిసి బడలుపడం గఱచి కిచుకు
కిచుకురనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులం భక్షించి.

క. తలనంటి పట్టుకొని చి,ప్పలు విరిగి పడంకుచున్నవాని సహోయ
జ్జలపాదు విడిచి రోషా,విలమానసుఁ డగుచు మందవిదుఁ డిట్లనియెన్. 371

క. తగునే భోగశిరోమణి, నగునే నొకవేళ నలఁగి యరుదెంచినఁ బై
నెగురుకొనఁ గొండయొక్కెడ, దగరెక్కెడ వలదె తారతమ్యం బరయన్. 372

క. నలఁకువ ధర నెవ్వరికిం, గలయది యమహాబలారిగా యితఁడంచుం
దలఁపక గౌరవమింతయు, సలుపక నను నసదుసేయఁజనునే నీకున్. 373

క. అతిమణిఘృణిసంభరణో, చిత మగు నాఫణము కష్టశీలా నీవు
త్సితపుటడుగులకు వర్త్మమె, తతినిక్కనలాఱ మ్రింగెద న్ని న్నను మన్. 374

క. వడి నొడిసిపట్టుకొని దెస, పడ నొడలుం దొడలు బడలుపడ నొక్కి ముదం
బడర దిగమ్రింగి వలసిన, కడఁ కరిగె న్మందవిదుఁడు కాకాధ్యక్షా. 375

వ. ఏ నమ్మందవిషుచందంబున నపమానంబున కోర్చి ప్రతిపక్షక్షయం బాపాదించితి
నని చెప్పి చిరజీవి మఱియు మేఘవర్ణున కిట్లనియె. 376

క. మూలముల జెఱుప వనలు, జ్వాలలు తరువులనకాని చందనశైత్య
శ్రీల మగుగాడ్పుచెఱుచు, న్మూలంబులతోన వృక్షముల శీఘ్రమునన్. 377

క. ఘనమున ఋణశేషము సా, ధనముల రిపుశేష మౌషధంబునఁ దనుసం
జనితగదశేష ముదకం,బున శిఖిశేషం బశేషముగఁ జేయఁదగున్. 378

చ. ముడివడియున్న దుర్వ్యసనము న్సడలించి దురంతరోషపుం
గడలి సుశాంతిసేతువునఁ గట్టి సమానము దేశకాలముల్
కడఁగనిచిత్రగుప్తి పొసఁగ న్మను తేనికి వేయునేల యి
ప్పుడమిఁ గరస్థలామలకముల్గద సంపదలు న్సుఖంబులున్. 379

క. శరములఁ బవరుమనీషా, శరములఁ బడినట్లు రిపులు సమరమువలయున్
శరములకు వలను ప్రజ్ఞా, శరములకుం గ్రాహ్యమెద్ది సరియారెంటన్. 380

క. అలఁతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్లపనులొదగు మహా
బలుల కది లేకయుండినఁ, బలుకులు వేయేల కడమువడు సర్వంబున్. 381

వ. సుచరితఫలంబులంగాక సకలకార్యంబులు చేకూడవు త్యాగంబున శూరుండును
వైదుష్యంబునం బ్రియుండును గుణంబుల లబ్ధుండును నగుచు రాజు రాజ్యంబు
గావింపవలయు నిందొక్కటితక్కినం బురుషాకారంబు నిరర్థకం బని వెండు మఱి
యట్టిద. 382

సీ. ఘనయూషనిధి యనంగునకా నంగిత్వ ముచితమే బలికహివ్యూహవసతి
పాండునందనునకా బహుకాలవనవాస మిభపురాధిపునకా యేటిచోరవ
యముకులాగ్ర్యతునకా శాపమరణంబు జాహ్నవీసుతునకా శస్త్రశయ్య
నలరాజుకా మహానసపాకభజనంబు నహుషునకా ఘోరనాగమూర్తి

తే. మతి త్రిశంకునకా పచ్చిమాలతెనము, ద్రుపదనందనకా రాచతోత్తుపాటు
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁ డరయ, నీశ్వరుఁడుగాక సమకూర్పనిట్టివనులు.
వ. ఇదియొట్లేఁగి ప్రజ్ఞాన్యాయంబు లేమఁజక యుండవలయు దైవబలంబు గలవాఁడవ
గుట నీకు శీఘ్రకాలంబునఁ గార్యసిద్ధియయ్యె నిరమిత్రుండవయితి ప్రాప్తమి
త్రుండవయితి వింకఁ బ్రాజ్యవైభవంబున రాజ్యంబు సేయుమని చిరజీవిచెప్పిన
మేఘవర్ణుండు సకలసంపత్పరిపూర్ణుండై రాజ్యభోగంబు లనుభవింపుచుండె. 384
క. అని చెప్పిన ధరణీవర, తనయులు నిజగురునిఁ జూచి తాత్త్వికముఖ్యా
వినఁ బ్రియమయ్యెడు జెపుమా, యనువారఁ జతుర్థతంత్ర మనియడుగుటయున్.
చ. అతనుభయంకరైకవిషమాంబకసవ్యగనంతభోగసం
గతవిగతాంతరాయగతి గాఢవినాయకన త్రైచి త్రజా
ద్భృతిబహుపద్మజాండమణిదీపితకుక్షికరంకమందరీ
కృతపరత త్త్వవిజ్జటిమృగేంద్ర వికస్వరయోగపుష్కరా. 386
క. రంగత్తరజాతమహా, గాంగేయ స్తవనఘటితఘనపులకాయ
త్వాంగనిచోళయుతప్రా, గ్రంగస్థలమధ్యసంచరణశైలూషా. 387
మాలిని. కలుషసుశకధూమా క్లాంతచింతామణామా
ప్రళయకరణరోషా ప్రాణిసంగుప్తితోషా
విలసదచలధర్మా విశ్రుతశ్రౌతకర్మా
సులభభజనలోలా సుస్థిరశ్రీవిలాసా. 388

గద్య. ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకల
సుకవిక్రుతకైవారభాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ
పరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతపర్వతరాజకుమార నిస్పృహాయుప్ర
బంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతంబైన
పంచతంత్రంబున సంధివిగ్రహం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# పంచతంత్రము.

## చతుర్థాశ్వాసము.



సత్యాలోకనజని
తాసముశరకరణసంభ్రమాధికనరక
త్రాసవిధిప్రాఘరణా
భ్యాసభుజార్గళసనాథ హరిహరనాథా. 1

వ. దేవా లబ్ధనాశనాభిధానచతుర్థతంత్ర మాకర్ణింపు మధీతసకలశాస్త్రమర్ముం డవ్విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. పరకపటాలాపపరం, బరకేర్పడ భ్రమసివిడుచు ప్రాప్తార్థముగా
పురుషుఁడు విడువఁడె యును సాఁగరమునఁ గపిశింశుమారకము గుప్ఫణిశిలెన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రవతంసుఁ బలికి రదియెట్లు నయ
ప్రావీణ్యా యాకథ జెపుమా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. నీరదపథికపానీయనికేతంబు మేదినీయువతికటీదుకూల
మంబరచరవరాభ్యవహారసత్రంబు సరిదలంకృతికార్యకరణశాలి
కార్పణ్యభయదవీక్షణావధూజనికర్త్ర రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాకనిసర్గశుభదాయి నిస్తులరత్నపూర్ణితకరండ

తే. ముగ్రశతధారధారాసముగ్రభీతి, పరవశాగత బహుకుభృద్భరణనిపుణ
మతనుసత్వ మలక్షితౌర్వానలంబు, వఱలు దక్షిణశరధిసర్వజ్ఞశరధి. 5

సీ. ఇమ్మహాగాంభీర్య మెవ్వనికాదవు నీవాహినీభరణ మెవ్వనికిఁగలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీయనిమిషావాప్తి యెవ్వరికిదొరకు
నీసత్యసౌభాగ్య మెవ్వనికెసఁగు నీఘనహితాచరణ మెవ్వనికి నాదగు
నీగాఢజీవన మెవ్వనికుండు నీకనకరత్నోర్మ్యు లెవ్వనికి వశము

తే. నీలలితరాజసస్థాన మెవ్వనికి లభించు నెవ్వని కిట్టియొప్పిదము నిత్య
మాతనికెకాక యని లోకు లభినుతింపఁ, గ్రాలునిర్భరవిభుఁ డాపగావిభుండు. 6

క. అపరిమితం బుడుపతతర, ణ్యుపసక్తం బఖిలజలధరోపాస్యం బా
త్తపదస్థానిమిషంబు, ద్వ్యప్రులాత్మోమం బనంతవిధ మెఱిఁగించున్. 7

క. ఆనీరధితటమున బహు, మానుం డనువాఁడు వృద్ధమర్కటుఁడు మహా
వానరులు ముఖరపత్ర, స్థానరులు భజింప సుముఖుఁడై వర్తిల్లున్. 8

ఉ. వానికిఁ గంటిలో నెరసుపంటివిరోధి సమీపపర్వత
స్థానమునం జయోన్ముఖుఁడు తామ్రముఖుండు చరించు నమ్మహా
వానరసార్వభౌముఁడు ప్లవజ్జవసంగబహుప్లవంగసే
నానతగోత్రుఁ డౌచు నొకనాఁడు సమిత్కరణేచ్ఛ వచ్చినన్. 9

క. కైకొనఁగలబహుమానుం, డాకంఠక్రోధవివశుఁడై ప్రతివీరా
నీకినిపై బలధిక్కృత, నాకపుల న్గపులఁ బనిచిన న్నిశ్శంకన్. 10

క. ఆహవ మొనరించె సము, త్సాహత నిరువాఁగు దోఃపరి దంతాదంతిన్
బాహాబాహిముఖాముఖి, నాహవాఙ్ముఖరఖరతర మై నభ మొప్పన్. 11

శా. లావు ల్పేర్కొని నొంతు రగ్విఁ బిడికిళ్ళం ద్రెళ్ళ పోర్వ్యాచల
గ్రావంబు ల్పెకలించి ఱువ్వుదురు మ్రగ్గ న్మోగ్గ వృక్షాగ్రశా
ఖావర్గంబుల నెత్తి మొత్తుదురు సుక్కం జిక్కఁ గంఠచ్ఛటల్
గావుల్వెట్టుదు రొండొరు ల్మదమణంగం బ్రుంగ నవ్వానరుల్. 12

క. చఱతురు పెడచేతులనోఁ, గఱతురు తెరనోళ్ళఁ బిసితఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు, పఱిబోవనికలిమిబలిమిఁ బ్లవగాధ్యక్షుల్. 13

క. విరసను నెఱసాహసమున్, బురిగొన నిట్లుభయసైన్యములు పోర ర
క్తరసతరసములు గదురఁగ, శరనిధిసత్త్వములు వెలివిసరి రాఁదొడఁగెన్. 14

వ. ఆప్లవంగసంగరం బావిష్కృతారుణంబు నవ్యక్తతారకంబు నగుచు నహర్ముఖం
బును లుంఠితాగమనంబు లుంఛితశత్రురోషంబు నగుచు బాద్ధకర్మంబును నదృ
ష్టశాస్త్రంబు ననక్షతపరికరంబు నగుచు యౌవనవివాహంబును బరిభ్రంశితచరణం
బుం బ్రణష్టవాళీవిలాసంబు నగుచుఁ గుకవికవిత్వంబును ననుకరించె. 15

క. అంతఁ దనఘనబలంబులు, పంతము దిగనాడి యోడి పఱచిన సంప
ర్తాంతకుఁడన బహుమానుఁడు, తాం తేతరతామ్రముఖపతాకినిఁ దోలెన్. 16

తే. అప్పు డూర్ధ్వశిఖుం డైన యనిలసఖుఁడు, పోలె మత్తామ్రముఖుఁడు చూపులనతిస్ఫు
లింగసంఘాత ముదయింప నింగినింగి, దాఁకుచం బాన బహుమానుఁ దాకసించి. 17

చ. తఱిమివధింప శత్రునకుఁ దానసమీకసమీకరంతయై
యుఱిముఱిఁ బల్కె నోరిజరతా పెఱతావునకేగు నాబలం

బెట్టేఁగియుఁ జూవనేలయిపుడీ వన నబ్బహుమానుఁ డోరి ద
బ్బలులకు రాను తాఁకువెడపల్కుల కోర్చినవాఁడఁ గాఁ జుమీ. 18

క. పందవుఁ గాక పలాయన, కందళితసాహసునియందు గలుగునె యని మి
న్నందినకోపంబునవై, చెం దామ్రముఖుండు పుల్లసిల శిలనలుకన్. 19

క. మఱియొకకుటవిటపంబునఁ, జఱచి ఘనక్రోధదృష్టి సమకొనముష్టిన్
బఱియపడ నురముఁ బొడిచిన, మఱియుం బడకపుడు తామ్రముఖుఁ డుగ్రుండై.

క. బలవంతు మాల్యవంతుం, జలధికడం గడఁగి నొంప సమయింపంగాఁ
దలఁచుహనుమంతుఅంతున, వలస్పృధుం గ్రుద్ధుముష్టిహతి క్షితిఁగూల్చెన్. 21

తే. కూల్చి చంపక యుసురుతోఁ గూడ నతని, నతనికాంతాళిఁ గైకొని యతులగతుఁ
బఱచి వారాశిరాశితత్ప్రాంతకాంత, ధరఁ జిరాద్భుతిశ్శైత్యకృత్యము లొనర్ప 22

క. కొండొకకాలమునకుఁ గపి, మండలపతి మూర్ఛఁ దేఱి మహిరహితోఁ గూ
ర్చుండి కనువిచ్చి రిపును, ద్దండపరాక్రమునిఁ గాంచి తలవంచుకొనెన్. 23

వ. అగణ్యదాక్షిణ్యాభిముఖుం డగుతామ్రముఖుం డబ్బహుమానును నన్వర్థనాముఁ
గావించి పంచిన. 24

చ. జరఠకపీంద్రుఁ డట్లరిగి సాగరతీరమునందు మానితాం
బురుహభవాండషండపరిభూషితుఁడై వెలుఁగొందుచున్నయీ
శ్వరుఁడన నుజ్జ్వలజ్జటిలసారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భమునాఁ జను మేడిదోఁచినన్. 25

క. పరికించి యయ్యుదుంబర, తరువెక్కి తదీయపక్వతరఫలసేవా
గరిమం బ్రాణానిలసం, భరణముఁ గావించికొనుచుఁ బ్లవఁగుం డుండెన్. 26

క. అలకపిచేతిపచేళిమ, ఫలము ప్రమాదమున జారి పాథోధిజలం
బులఁ బడియెఁ బడిననొండొక, బుళబుళశబ్దంబు సంప్రభూతం బయ్యెన్. 27

క. ఆనినదము కర్ణంబుల, కానందవిధావిధాయి యగుటయు గణనా
హీనము లగుతత్ఫలముల, వానరుఁ డక్కడలి నీటవైవఁగఁ దొడఁగెన్. 28

క. వనచరకరముక్తములై, వనధింబడు మేడిపండ్ల వారణలోలోఁ
దినుచుఁ జలింపక క్రకచుం, డనుదారుణశింశుమార మచ్చోనుండెన్. 29

క. అధికతమోదుంబరఫల, మధురరుచిం జొక్కి శింశుమారము మాసా
వధిగా నచ్చోటన కర, మధివసియించె న్నిజప్రియావిముఖంబై. 30

చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం
డకట యొకేనిఁ బోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో

తికమకమైతి నా నెగలుఁ దీర్పుము నీవిపు డేఁగి మాఁది నా
యకసుఖవార్తఁ జెప్పుమని యంచిన దూతిక పోయి ముందరన్. 31

క. ఒకచో వికచోదుంబర, నికటంబున ముసలిక్రోఁతి నెయ్యంబునఁ బా
యక యున్న శింశుమారుం, గ్రకచాంకుని దూతి ప్రీతిఁ గని చని యొనరన్. 32

చ. చెలువఱియున్న కూర్మిచెలిఁ జేరి వినం గన క్రొత్తలైనవో
చెలి తెలియంగ నంతయును జెప్పెద రోయక విన్ము నేను నీ
యలఘుని యోగమూఁది చని యక్కడ నొక్కెడఁ జూచి వచ్చితిం
దొలఁగక వానరప్రమదతోఁ గవఁ బాయని వాని నీపతిన్. 33

క. నే నెఱుకచేయుకొఱకిట, వెనువెనుకను వచ్చివచ్చి వెలఁదికొలందిన్
జననీపని చెప్పితిఁ బన, వనితారతిలుబ్ధుఁ డేల వచ్చు నగుడన్. 34

క. నావిని కాఁపుర మెటువలె, నీవిధమునఁ బ్రాణనాథుఁ డితరస్త్రీమై
త్రీవశుఁడయి యుండఁగ నని, పావకశిఖిపోలె మండిపడి యది మదిలోన్. 35

చ. కనుఁగవ నశ్రులోడికలు గట్టఁగఁ దైలనిషిక్తయై నిజా
నన మరవాంచియుండె సదనంబున నత్తఱి శింశుమారుఁ డ
వ్వనచరనాథుపేర్కొని యవారిగఁ దివ్యని మేడిపండ్లు గొం
చు నిలువ కేఁగుదెంచి యిలు సొచ్చి కళాంగనఁ జూచి జూడ్కికిన్. 36

ఉ. ఒండొకభంగిఁ దోఁచుటయు నుల్లము ఝల్లనివల్కె శింశుమా
రుండు ప్రియానయాతిగవిరోధిని హృత్ప్రియదాప్రమాదినే
యండ కువచ్చినం బలుక వక్కట నీవన శింశుమారిని
ష్ఖండవిధానమైన యలుకం దలయెత్తగు చూడ దెంతయున్. 37

క. అది యట్టిద యప్పనికిం, బొదరగుటం దూతిప్రీతిఁ బురికొనఁ బలికెన్
జనురాలికిఁ దెవులెత్తిన, యది నీతో నెట్లుమాటలాడం గూడున్. 38

క. మందులు దెమ్మని చెప్పిన, మందులు నిచుఁ గొలుచుభటులు మాతోఁ దమలో
నిం దెవ్వరుఁ బలుకరు నీ, చందముగా నెట్లు సాధ్వి జారుజ మానున్. 39

క. నావిని క్రకచుం డను మ, జ్జీవము తౌషధము లయినఁ జేడియ కీలో
సేవింపఁజేసి నిర్గదఁ, గావించెదఁ జెపుము దాఁచఁగా నేమిటికిన్. 40

క. అని కూర్మి తేటపడఁ బ, ల్కినపల్కులు శింశుమారి గెంటని వేడ్కన్
విని నీతితంత్రమంత్రిం, గనుఁగీఁటిన నతఁడు చేరి క్రకచుని కనియెన్. 41

క. ఎలనాఁగ రోగమణఁపం, గలమందులు చెప్పఁడనిన ఘనశాస్త్రకళా
బలవేద్యులు వైద్యులు గే, హారీతిం గ్రోఁతిగుండె పలెనని రధిపా. 42

క. అది ముదిత కోసఁగనున్నన్, బ్రతుకదు చెడచెడఁగరాదు పరిణామమునన్
మఱిఁగదిరిన వెఱఁ గ్రకచం, బిది యెవ్విధిఁ బొరయు భార్య నెట్టిదేర్తున్. 43

క. బహుమానుం డొకఁడున్నాఁ, డహితుఁడు గాఁ డతఁడు హితుఁడు హాహా ముక్త
స్పృహగృహాత్మార్థము దు,స్సహమహనా ప్రజ్ఞ నెట్లు చంపుదు నతనిన్. 44

చ. నిరతము విశ్వసించు నతినిర్మలచిత్తున కెగ్గుసేయుకా
పురుషుఁడు దక్క భూరికులభూమిధరంబులు గావు సప్తసా
గరములు గా వరణ్యములు గావు భరంబని ధాత్రి మైత్రి నా
సిరివరుతోడ విన్నపము సేయదె వేఁడిన నట్లు గావునన్. 45

చ. కడపట భార్యనిల్కడనుఁ గాఁ జెలికానికి నెగ్గుసేఁత యొ
క్కఁడు దురితంబు కాఁపురము గూలఁగఁ జూచుటయు న్మహాఘ మి
ప్పుడఁ దుకపట్టున న్సఖునిపట్టున నింతి విశేష మింతకై
చెడుపనియేనియుం దగిలి చేయక మానఁగరాదు గొబ్బునన్. 46

వ. అని నిశ్చయించి బహుమానవధోద్యోగంబునం దిరిగి వచ్చె నప్పు డుప్పొంగుసమ్మ
దంబునం బ్లవంగపుంగవుండు. 47

క. క్రకచావికచాద్భృతియు, ద్దఁ గ్రమ్మర నరుగుదెంచెదవు కులకాంతా
నికట మకటా యసహ్యం, బౌకో సత్యముఁ జెప్పుమనిన నుపచరుఁ డనియెన్.

ఉ. ఏను భవన్నియోగమున నేగి ఫలంబులు కానుకిచ్చినన్
మానిని పల్కె నీ వరిగి మాసకమయ్యెఁ బ్రవాస మెవ్విధిం
బోనిది నీకు నెద్దిగతమో గతమోహభవద్వినంబు నా
తో నెఱిఁగింపుమన్న భయదూరపదాద్భృతి నంటి దానికిన్. 49

చ. తనయునమాన భామతిమిధామతటంబున లెక్కకెక్కడో
ఘనఫలరాజిఁ గ్రాలు మధుగర్భము నాఁ జనుమేడి దానిపై
మను వనువాసరంబు బహుమానుఁడు తత్కపిచక్రవర్తి ప్రో
పున నితరం బెఱుంగక యపూర్వసుఖస్థితి నుంటి దాలిమిన్. 50

చ. మఱువఁగ రానిసఖ్య మది మాటలు వేయును నేల పుట్టి బు
ద్ధెఱిఁగితిఁ గాని యట్టిజగదేకపవిత్రునిఁ జూడ నెందు నో
తెఱవరో యంచుఁ బౌరకుగతిం గృతి నీయుపకారకృత్యముల్
గుఱిగడనం బ్రియంబుతమిఁ గొండలు కోటులు చేసి చెప్పితిన్. 51

ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై ప్రియంబు సొం
పుప్పతిలంగఁ బల్కె నది యోయికృతఘ్నుఁడ వీవు గావె య

ప్పప్ప సుహృత్తముం డయిన యాయన నింటికిఁ దెచ్చి వేల్పు నే
చొప్పునఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యల దేల్చుటొప్పదే. 52

ఉ. ఎక్కటి మేడపై నిలువ నేటికి నేఁటికిఁగాదు నిల్చెఁగా
కెక్కుడఁ బెద్దకాల మఖిలేప్సితభక్ష్యము లావహింతు నా
మ్రొక్కనిమ్రొక్కి పెక్కుప్రియము ల్నయము ల్పచరించి తోడితె
మ్మ క్కపినాథునంచుఁ బ్రియయంచిన నిన్గొనిపోవవచ్చితిన్. 53

క. కారణవిముఖుండై యుప, కారముఁ గావింపలేరుగద లోకము కై
వారం బగు నిట్లన ని,ష్కారణవత్సలుఁడ వీవు కారణజన్మా. 54

క. కపివర నీచేనందిన, యుపకారపుటప్పుఁ దీర్పనోప న్గరుణా
నిపుణమతి నాగృహంబున, కిపుడీ వేతెమ్ము పూజ లిచ్చెద భక్తిన్. 55

క. ఇలువాడిమ్రుగ్గులిడి కూ,రలు గూ ర్లమరించి యేలరాఁడాయెనొకో
వెలలెం బ్రొద్దని యట నీ,చెలియలు నేఁ డెదురుఁజూచు సేవించుటకున్. 56

క. రారానిచోటుగాదు కృ,పారాజితపిచ్చుకుంటుపైఁ బర్వినభా
గీరథివిధమున నస్మద, గారమునకు రమ్ము కపిశిఖామణి యనుడున్. 57

వ. ప్లవంగపుంగవుండు. 58

ఉ. రాసిరణం బొనర్చి నిజరాజ్యముఁ గైకొని నన్ను గాసి గాఁ
జేసినవైరిఁ గన్గొనుచుఁ జెంగటనుండుట కష్ట మిందు నా
కోసఖ యట్లుగానఁ బదమూఁద సహింపదు వంతువెంబడిం
గాసిలియుండువారలకుఁ గానని క్రంతలు మేలుగావొకో. 59

క. అనఘా నీనిలయమునకుఁ, జనుదెంచెద మీకుఁగాక జలసంచారం
బనువగునే మముఁ బోలిన, వనచరులకుఁ జెప్ప మనిన వాఁ డిట్లనియెన్. 60

క. నీవాక్యము లుచితంబులు, గావె పయోవిహృతియేడఁ గపులేడ యొకే
నావీపున ని న్నిడికొని, యావాసముఁ జేర్చువాఁడ నరుదె మ్మనినన్. 61

వ. తద్భాషితంబులు మాయాదూషితంబు లగు టెఱుంగక, 62

చ. మెఱసి యుదుంబరద్రుమముమీఁద వసించినకీశరాజు చే
టెఱుఁగనికూనతెప్పవలె నేర్తెఱఁ దోఁచినశింశుమారుపై
నుఱికెఁ దదీయపృష్ఠమున నుండినవాఁడు విశృంఖలత్వరం
బఱచి హుటాహుటి న్మనికిపట్టున కేఁగెడుత్రోవ నేర్పడన్. 63

క. నీరము తెరువునఁ గొండొక, దూరము చని యలసి నిలిచి దుర్దాంతవిషా
దారూఢహృదయమై చిం,తారతి నది యీ రెలుంగునం దనలోనన్. 64

ఉ. న న్నితఁ డంతరంగమున నమ్మి యయో చనువెంచుచున్న వాఁ
డెన్ని భవంబులం దొలఁగు నిష్టులఁ జంపినఘోరపాప మెం
దు న్ననువంటిదుష్టచరిత్రుం బరికింపదు లోక మాక్రియల్
గన్నవిగావు విన్న యవిగా వొనరింపఁగఁ బాసె సఖ్యముల్. 65

క నడవడి పురుషుని భారం, బిడి భూరివృషంబు లాత హేమము నొఱయం
బడు శుద్ధికీర్తిరుచులకుఁ, బడఁతులహృదయంబు లారయఁ బడ వేగతులన్. 66

మ. పరమద్రోహపురస్సరంబులు నయోపాయక్రియా దూరము
ల్దురితచ్ఛన్నము లన్యతాపకరణోద్యోగంబు లప్రత్యయా
కరము ల్సత్యపరాఙ్ముఖంబులు సమగ్రక్షాంతివల్లీశిత
క్షురము ల్దంభమయంబు లెట్లెఱుఁగవచ్చుం గామినీచిత్తముల్. 67

క. ఈమనసులు గలిగినమహి, శ్రీమాయామయతరోక్తులకు లోనై య
య్యో మదినమ్మినకీశ, గ్రామణిఁ దెగటార్చవలసెఁగా నా కనుచున్. 68

క. అలక్రకచుఁ డల్లనల్లనఁ, బలుకఁగ విని వానరాధిపతి భూరిభయా
కులమానసుఁడై యాపుడో, దళితాఘా యేమిపలికెదవు నీ వనుడున్. 69

క. ధృతిఁ గ్రకచుఁ డపుడదత్తా, ప్రతివచనం బగుచు నుఱకపలుచుచునుండెన్
వితతప్రజ్ఞం గపి యు, ద్ధతు వానిం గ్రమ్మఱించెదం గా కనుచున్. 70

క. భీతిప్రవాహ మతిధృతి, సేతువుచే నాఁగి పలికె చెలికాఁడా నీ
శాతోదరి నాసోదరి, కౌతుకమున నున్నె భవదగారం బమరన్. 71

క. ఇది వినవలతుం జెప్పుమా, మది వొదలఁగ ననిన శింశుమారుఁడు పలికెన్
గదబాధిత యయియున్నది, గద నీయనుజాత యెట్లుగా ధరియింతున్. 72

సీ. భార్యలేకయొనర్చుపండువు దండువు కులకాంతపెట్టనికూడు గెడు
పత్నితోఁ బలుకనిపలుకులు చిలుకలు గృహిణిలేనికబంధకేళి జాలి
జాయవాటింపనిసరసము ల్విరసము ల్ప్రాణేశ్వరికిఁ గానిపాటు చేటు
దయితకై చేయనిప్రియములు భయములు వల్లభవెలియైనయిల్లు పొల్లు
తే. ముద్దుకులకాంతసుద్దు లేప్రొద్దు విననిచెవులు గవులు వృథా వేయుఁ జెప్పనేల
యకట సతిలేనిబ్రతు కేల యర్థ మేల, వాహనములేల కరులేల వసుధయేల. 73

క. నా విని బహుమానుఁడు బా, ష్పావృతముఖుఁడగుచు వాని కనుఁ గ్రకచా నీ
దేవి రుజ మాన్పుటకు లే, రే వెజ్జులు మందుఁ జెప్పరే వా రనినన్. 74

క. చెప్పిరి వానరహృదయం, బప్పనికి నవశ్య మనుచు నగదంకారు
లప్ప కదిహేతువుగ ని, న్నిప్పుడు గొనిచనుట యని యహితుఁ డతఁ డాడెన్.

క. నగచరుఁ డదివిని వెఱఁబం, డ్లిగిలిచి వడవడ వడంకి యొదపడి చెడితిన్
దెగితిఁ గడచనితిఁ బొలిసితిఁ, బొగరున నిట్లయితి మోసపోయితి ననియెన్. 76

వ. అని. 77

క. దారుణగహనంబున నా, హారోఁతలఁ బెట్టుమఁదిమి నసురుసురై కా
మారంభం బుడుగని యల, ఘోరాఘఫలంబు గట్టి కుడిపెడునన్నున్. 78

క. భీమాటవిలో నున్నం, గామాంధుని బొదవుపాతకంబులు రాజ
గ్రామమున నున్న దూరిత, కాముని గల్మషము లంటఁగా శంకించున్. 79

క. చిరకాల మరిగె సురిగెం, దరుణిమ యిక నేడ గామతంత్రం బనుచున్
బరలోక చింత సేయుని, పురుషార్థముఁ జేటుపాటు పొందదె యనుచున్. 80

చ. క్రకమని చూచి వానరశిఖామణి యిట్లను నీవిచార మే
టికిఁ జెడిపోయె నేమిటికి డెందె భవన్మతిప్రాణమైనభా
ర్యకు రుజమాన్పఁ గిశహృదయంబునకుం జను దెంచువాఁడ వి
వకట యెఱుంగఁ జెప్పవలదా మునుగల్గగ నాకు నింతయున్. 81

ఉ. చెప్పిన నాయుడుంబరపుఁ జెట్టున నెప్పుడు దాచియుంచు నొ
క్క్రొప్పుడు మామకీనహృదయంబు సపూర్ణణఁ జేసిపుత్తు నీ
చొప్పున నింత దాచెదరె చుట్టముఁగానె విరోధినే వృథా
త్రిప్పటజేసి తింకొరులు దెత్తురె నిన్నడవం బ్రతిక్రియల్. 82

క. హృదయము దరువున నున్నది, గద నా కాయమున లేదుగద మునుగా నా
కిదిచెప్పక పని చెఱిచితి, గద రిపుఁడవుగాని చెలివిగా వంగనకున్. 83

సీ. గృహారకామచింతకులకు భూదేవధారుణీపరవధూదర్శనములఁ
జనరాదు రిక్తహస్తములను గామ్యార్థి వగునీకు మున్నుపాయనము వలయు
హృదయంబు మేడినున్నది పోకమరలు నిమ్ముండి తారిని కాయ గుండెకాయ
చేయార నీకు నిచ్చెదఁ బుచ్చుకొని చేరి జాయ నిరామయఁ జేయవయ్య
తే. యనుచు బహుమానుఁ డాడు మాయామయోక్తు, లాగమోక్తులు గానప్పు డాత్మఁ దలఁచి
తిరిగి యాశింశుమారుఁడే తేరఁ దీర, వృక్ష మెగఁబ్రాఁకి కపి వాని వెక్కిరించె. 84

క. కసినుస నాఁకట ఫలము, ల్మెసవుచు జలివిడిచి మేడిమీఁద న్మోదం
బెసఁగ నటియించు వానరు, మసలక వీక్షించు శింశుమారుం డనియెన్. 85

చ. కుజమున నున్నవానరుని గుండియ దండియశంబు నీకుఁగా
భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయొదదీఱ మత్ప్రియా
రుజ కనఁ బల్కె [illegible]గా ననచరుండు దురాత్మ విచారమూఢ యే

కుజమునమండు వానరునిగుండియ యొక్కడిజోలిపొమ్మిసీ. 86

చ. స్తుతులఁ గరంచి నాగృహము జూతువు రమ్మని తోడుకొంచుఁబో
యి తగవుమాలి నన్నుఁ బొలియింపఁగ యత్నముఁజేసితేను నీ
గతి భవదీప్సితం బొసఁగుకై పడి నిన్మరలించి మేనిబ్రో
చితి జిరకాలజీవి మతిశీలుఁడ మోసము నాకుఁగల్గునే. 87

క. కదలుమిఁక నినుఁ గ్రకచుం, డెదపడి యేపఱన మోసమెఱుఁగనినను ని
మ్మదిక్రోఁతి మోసపుచ్చెం, గదరాయని విన్ననగుమొగముతో నున్నన్. 88

వ బహుమానుండు. 89

క. దొరకిన నను విడఁచుట కబ్బురపడకుము నీకుఁ దోడుపోయినధరణీ
సురుఁ డొకఁడు లబ్ధమునుజే, శ్వరకన్యక విడిచి రిత్తవాఁడై చనఁడే 90

క. నానీరచారుఁ డాబహు, మానున కిట్లనియెఁ దెలుపుమా వినవలతున్
దానేలవిడిచె నయవి, ద్యానిధి బ్రాహ్మణుఁడు భూతలాధిపకన్యన్. 91

సీ. అనిన శాఖామృగాధ్యక్షుఁ డాక్రకముని గనుఁగొని పలికె నిక్కథ వినంగ
దగుదువు నేనును దగుదు నీకెఱిఁగింప మును విశాలాపురంబున సుకీర్తి
యనురాజు రాజిలు నమ్మహీజానికి భువనమోహిని యనుపుత్రి గలదు
దానికి మందాభిధానుఁ డొండొకధరాత్రిదశుండు సుముఖుఁడై చదువుఁజెప్ప

ఆ. నట్లు కొంతకాల మరిగిన నపరఁజి, పనీఁడి కలరుతావివలె మనోజ్ఞ
ఫలము చెఱుకునందుఁబలె నేమిచెప్ప లేఁ, బ్రాయమయ్యె నానృపాలసుతకు. 92

మ. సితరోచిర్ముఖికప్పుగొప్పు సుమనస్స్నేహం బధిష్ఠించి కృ
ష్ణతనొందంగని యోర్వలేక వదనాబ్జాతంబు గాంచె న్వ్యధూ
న్నతిజన్ముంగవ యచ్యుతాప్తి బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితిరోమావళివల్లిచక్రితభజించె న్నిష్ప్రియాసక్రియన్. 93

శా. బింబోష్ఠంబు మధూద్ధతంబు పరహృద్భేదు ల్కటాక్షంబు లా
స్యం బుద్యద్ద్విజరాజమండలపరిస్పర్ధాళు వాకర్ణదీ
ర్ఘంబా గ్రాల్గనుదోయియుం గువలయప్రత్యర్థితారాపథా
లంబు ల్వాల్గురులేలొకో పొగడుజాలం జాలముల్లోకముల్. 94

శా. లీల న్రాగరసోదయస్ఫురణదాల్చెన్ మైజగద్గీతస
ద్వాలంకారపదప్రవీణయది యాహా యట్లుగాకుండినన్
వాలగ్రంథివరాళిమోవి నునుదీవంగూడి తోరంబులౌ
పాలిండ్లన్ ఫలమంజరీగరిమ జెప్పం జూపనౌ నెవ్విధిన్. 95

మ. అతిభాస్వత్తరకాంచనంబు చెలినాసాగ్రంబు కల్యాణ మా
శతపత్రేక్షణ మేను మేరుకుధరాంచత్కూటము ల్దానియు
న్నతవక్షోజము లేమిచెప్ప నదియంతాయంతబంగార మ
ప్రతిమం బౌనరనాథుపట్టి గణుతింప న్శక్యమే యేరికిన్. 96

క. తనకుఁ బయోధరవృత్తి వ్రేఁ, గని మిన్నెలనాఁగమధ్యమయ్యె న పైనన్
జనదు పయోధరభారము, జననాంతరకర్మమేల చను నెంచున్నన్. 97

క. పరమాణువు పరమమహ, త్వరిపూర్తి న్గోచరించుపరమమహత్తున్
బరమాణువై కనంబడు, దరుణీమధ్యస్తనేక్షితత్త్వజ్ఞులకున్. 98

క. కన్నులకు మొగముచాలదు, చన్నులకు నురస్స్థలంబు చాలదు వెన్నుం
బెన్నెరివేణికిఁ జాలదు, కన్నియచెలువంబుఁ బొగడఁగా నాతరమే 99

వ. ఈదృగ్విలాసధన్య యగునారాజకన్య చకోరికాపరివృత యగుచంద్రికయుంబోలె
సఖీజనసహాయయయి వన్నెమెఱసి యొక్కనాఁడాస్థానంబునకు వచ్చె నట్లేగుదెం
చిన కుమారీరత్నంబు సౌహార్దభాసమానోల్లాసంబునం దిగిచి యంగపీఠంబున నునిచి
సుకీర్తిబంధుజనానులతోడఁ దత్సౌందర్యసౌశీల్యాదిగుణంబు లుగ్గడించుచు గొలు
విచ్చియుండె నాసమయంబున. 100

సీ. చిఱుతకెంజడలఁ గీల్చినజాతిపటికంబు గళమున రుద్రాక్షకంఠమాల
యపరంజిపసిఁడికామాక్షులుఁడామూఁపుపై గొండ్లిఁగావించుయోగపట్టె
చిన్నారికంబెగ్రుచ్చినకింగినాదంబు గుత్తంపుజిక్కులకుట్లబుఱ్ఱ
కరమునఁ బెనుచౌఅగరిముల్లు మాయూరబర్హనిర్మితమైనబవిరిసురటి
తే. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ
లమరఁ జెట్టునడిగినట్టు లవనినాథుఁ, జేరనేతెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. 101

క. ఏతెంచినఁ గాంచి ధరి, త్రీతలనాథుఁడు హృదంకురితనిర్నిద్ర
ప్రీతి నెదురేఁగి నతుఁడై, యాతిథ్య మొనర్చి యమ్మహాయోగీంద్రున్. 102

క. వినయమునఁ దెచ్చి కనకా, సనమున నిడి రాజుపలికె సదయా మీచూ
దసిభూములు వానం దడి, యనివారలు గలరె మిమ్ము నడిగెద నొకటిన్. 103

క. రాజకుమారులలో రతి, రాజకుమారుల సురూపరసవిక్రముల
త్సీజయములమించినవాఁ, డోజగదారాధ్య కలఁడె యొకఁ డట్లున్నన్. 104

క. ఆసర్వజ్ఞున కపర, వ్యాసా కులగోత్రజాత యగునీసుత ను
ల్లాసగుణావసతి నిచ్చెద, నాసక్తిం దెలుపుమనిన నతఁ డిట్లనియెన్. 105

క. ఇలఁగలరాజకుమారుల, దెలివిపడం దిరిగిచూచితిని బొటలపూ

ర్మిలయుఁడు జయసేనుఁడనం, గలఁడాతఁడు నీకుమారికనుఁ దగుఁ గూర్పన్. 106

క. ఆత్రైలోక్యశ్లోకిత, గాత్రుఁ బ్రశంసింపనేల కనుఁగొను మనుచుం
జిత్రరస మావహిల్లం, జిత్రించి మునీంద్రుఁ డధిపుచేతికి నిచ్చెన్. 107

వ. ఇచ్చినం బుచ్చుకొని యచ్చిత్రరూపంబుఁ జూచి యచ్చెరువంది యమ్మనోహరాకారంబు తనయనుంగుతనయకుఁ గానంజేసి యజ్జయసేనుండు దనకు మేనల్లుండు గావున సదృశసంబంధంబున కలరుచు. 108

క. జనపతి మునిపతిఁ బూజా, వినుతి నతిక్రియలఁ బల్లవిలఁజేసి ప్రియం
బున వీడుకొలిపి తానుం, జనియెఁ గొలువు విరిసి రత్నసదనంబునకున్. 109

ఆ. అట్లు రాజపుత్రి యాచిత్రరూపంబు, గన్నదనియఁ జూచి కంతదర్ప
మోహసింధుపతితయై హార మాహార, మాళిజనవిహార మరచిపుట్టి. 110

వ. చింతించుచుండ నెచ్చెలు లారామంబునకుం గొని చని. 111

సీ. కలకంఠి కతిశయోత్కలికావిలాసంబుఁ దార్పదే యారామధామకేళి
లీల నేత్రప్రియాళికి నమందానందలహరిఁ బుట్టింపవే లతలు విరులు
వికసిల్లునీపద్మినికి సదామోదంబు జరుపదే కాసారసారవిహృతి
శిఖిబర్హాతులితకైశికకు సంతాపంబుఁ బాపదే ఘనకదంబకములంబు

తే. సడలెనుగదమ్మ లావుకాంచనకలాప, పరిచయము మానెనమ్మ దెప్పరపువంత
వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ, కొమ్మ మ్రాన్పాటు కెట్లోర్చుకొనఁగవచ్చు.

వ. అని నెచ్చెలు లచ్చెలి నాలోకించి సుముఖిగాఁ జేయువారయి శిలీముఖప్రముఖంబులం జూపి యిట్లనిరి 113

చ. కరటులపొంకునం గదపుఁగాలము బల్లవసంగమంబునన్
దిరుగుఁ గుజాతమైత్త్రి నెడత్రెవ్వక శీనువుఁ గ్రోలు మాలలం
దరసిననుండు మ్రోఁత తఱుఁ జాత్మభరైకసుపర్వగర్వముం
గులుచయొనర్చు నెట్లుపొసఁగుం జెలి దీని ప్రియాళిగాఁ గొనన్. 114

చ. కలగుణముల్ ద్యజించి పలుగాకులవంటి వనంగవచ్చునే
ఫలదళపారణల్ వినయపాటవముల్ మతిప్రాప్తకాలభా
షల సుమహత్తరల్ చెలిమి సల్పఁగనుక్కు దగుం ద్విగంగదీ
ప్తులు వెలిఁగాఁ దపస్వినులు కోకిలకంఠులు మాకుఁ జూడఁగన్. 115

మ. మురిపంబుల్ గలమిండతేటికడియంబుల్ మారుతోక్షుభ్రమిం
దిరుగం భాసురకేసరేక్షుకణికాధిష్ఠానకించిద్వికా
స్వరపుంగ్రొవ్విరిఱోళ్ళఁ జైత్రహరినించం జంచరీకాలకా

మెరిసెం బుష్పరసైక్షవంబు చిగురాకుం గొప్పెర ల్మిందగన్. 116

చ. సరసులలో సువర్ణపరిష త్తముల్లై కనుపట్టుకోశముల్
గర మనురక్తిచూచి మృదులస్వర ముట్టిపడ న్నభాషితో
త్కరము విధాత కెక్కుడగుగౌరవ మొప్పఁ బఠించుఁ జూచితే
హరిణవిలోచనా పరమహంసవతంసము యూర్జితస్థితిన్. 117

మ. గమకంపుంబసనేలకై దిగినశాఖల్ హస్తపాద్విభ్రమ
భ్రమఁ బుట్టింప లతాంతబిందుకులముల్ పైదేర నుద్యద్ధ్వని
త్సమధూళీమదధారలూర నళిపంక్తుల్ గప్ప నుద్యానవా
నమహిం గానఁగనయ్యెఁ జూచితివె పున్నాగంబు బింబాధరా. 118

ఉ. ఉన్నతి నంబరం బొరసి యొచ్చె మొకింతయులేక కొమ్ములం
గన్నులపండువై బవరిగా నరుదెంచిన ప్రాసవాసవో
త్పన్నపురం బగ స్తదెలుప న్నలపాలికయొప్పె జూడు మా
సన్నబలైకపత్త్రకవిశాలము సాల మఖండమూలముల్. 119

చ. చదువులమేలులేదొ శుకసంతతిగాదొ వినీతరీతి చా
లదొ భజియించునీచతురుల న్మతిమాటకువచ్చునిచ్చలుం
బదిపదిగా నొనర్చుఫలభంగము నెమ్మొగ మెఱ్ఱజేయున
ల్లదె పరికింపుచిల్కహృదయంబున గోపముజిక్కె దొయ్యలీ. 120

చ. సరళగభీరశబ్దఘనసారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్నయా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతతు ల్భజియింప బాదవి
స్ఫురణఘటింపుచుం దొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము జేయుచున్నకవి నారసిచూడు మరాళగామినీ. 121

క. నిరుపమఘనరసపుష్టీ, స్ఫురణం బాదములు మెఱయ భూభువనమునన్
సరిజెప్పఁగలదె యిందిం, దిరకుంతల యీవసంతతిలకంబునకున్. 122

క. విరిశోఱవులఁ బథికపరం, పర జూడుంజూడు మిట్టిపరుషపలాశో
త్కరమునకు నెట్లుగలిగెం, ధరణీసురదండవిధిసుధామధురోష్ఠీ. 123

చ. గళితఫలాశఁ బూజకలికాచ్ఛలనంబున విస్ఫులింగము
ల్చిలుకుచు మత్తకోకిలవిశృంఖలఘోషమిషంబుచేత గ
ర్జిలుచు ధరాపరాగముల రేఁచి వడి న్నడిగొంచువచ్చెడిం
బెలుచమనోజమాంత్రికుఁడు పెంచిన గాలిపిశాచిఁ జూచితే. 124

ఉ. వేవెడఁగేల డీలుపడ వ్రేసినఁ బైఁబడ వక్త్రశీధుని
ష్ఠీవన మాచరించినవడిం జరణంబున దన్నిన న్రహిన్
బోవనిపార్థివస్ఫురణఁ బొందియు నుత్కలికాప్తినొందు హే
లావతి యిట్టినీచతరులం బరికించితె యిమ్మహావనిన్. 125

సీ. నెలఁత నీపలుకులో నిదికర్ణికారంబు వనిత నీనగ వెఱింగినది పొన్న
మెలఁత నీకనుసన్న నలరుబొట్టుగముద్దుపాలఁతి నీచేసంజ్ఞఁ బొదలు మావి
ముగుద నీసమ్ముఖంబున గ్రాలుసంపెంగ రామ నీహృదయపారగము క్రోవి
పడఁతి నీపదమాసపడునశోకము వినఁ బ్రియపడునీపాటఁ బ్రేంకణంబు
తే. అతివయుష్మత్పదగ్రహాశ్రితము పొగడ, యువిద వావిలియలరునీయుసురుతకలిమి
బంధుమధ్యము మివ్వనాభ్యంతరంబు, విద్రుమాధరకన్నిచ్చ విశ్రమింపు. 126

సీ. ఘనసుమనఃకులంబున నెట్లుపుట్టెనో యొరులచేరువ నున్న నుడుకుఁ జూపు
బహుపత్త్రభరణసౌభాగ్య మెట్లందెనో యుగ్రగంధస్ఫూర్తి మల్లసిల్లు
నిరవధికామోదభరిత మెట్లయ్యెనో మహిబుణ్యతరులకొమ్ములఁ బెనంగు
సతతాభివృద్ధి రాజసమెట్లుగల్గెనో కఠినకంటకమైత్రిఁ గడపుఁ బ్రొద్దు
తే. ననుచు బెనుచూరపోలె జెల్లాటమెసఁగ, నసమకుసుమాశచయకౌతుకాప్తి నడరి
సంపెఁగలమల్లికాగుళుచ్ఛములఁ బొన్న, విరులమతిగేదఁగుల రెమ్మ వెలఁదులంత..

ఉ. కోయిలనోరుసోఁకనిచిగుళ్లు నికారపుఁజిల్క భిన్నము
ల్సేయనిపండ్లు కాలవడి లేవడితె మ్మెరకూనరాశిగా
వ్రేయనికమ్మపుప్పొడి ప్రవృద్ధపిపాసమదాళిమత్తుకం
బోయనితేనియ ల్గమిచి పూవిలుకానిభజింప నంగనల్. 128

సీ. కలకంఠముల నోరికడిదివ్వవలె నంచుఁ జికిలిగుబ్బెతలు గోసిరి చిగుళ్లు
చిలుకమూఁకలకూడు చెఱుతమా యని పువ్వుబోండ్లు మాఁగినపండ్లు పుచ్చుకొనిరి
యొదుటుదుమ్మెదలఁ బస్తునుతమా యని ముద్దుకొమరాండ్రు విరితేనె కొల్లఁగొనిరి
మదటుగాలి వయాళి మాన్తమా యని కుమారికలు పుప్పొడు లావరించుకొనిరి
తే. అతనువిలు మూలవేయింతమని సుధార, సాధనలు తావిపూవుల నపహరించి
రంత నాక్రీడ భూక్రీడ నలసి యలసి, తాంబుజాక్షులు కంకేళిహాళి వ్రాలి. 129

సీ. మోమాటనలరుతమ్ములతావు లగలింప గనుసన్న మనుఝుషకముల నలపఁ
జూడనాసవమైత్రిఁ జొక్కినయళిరేఁప నరగుత్తికగుసంకు నలటఁ బెట్టఁ
గైవసం బగుబిసాగ్రముల నున్మూలింప మాటకు లోనైనమధువు లొలుకఁ
జనుమానమంటినజక్కవలను రేఁప దండఁ బాయనికుముదముల జెండఁ
తే. జరణముల నాశ్రయించినసన్నరాళ, నీడజములపయోభూతి నేలఁగలఁ

నెత్తుకొని రెంతనిర్దయు లీలతాంగు, లనఁగఁ గంకేళికాంక్షఁ గా లాఁగ కరఁగి. 130

ఉ. చేరువఁగాంచి రక్కలికిచేడియ లవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిభాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుంద్రగపూగకుటీరతీరమున్. 131

చ. కని బిసదండపత్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరుదిక్కులఁ బత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. పడిఁ బుటమెత్తి వ్రాలునిడువాలువచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁజేయ రాజుకై
వడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమాఖ్యమాలికలచొక్కపుఁదావులు సోఁడుముట్టఁ జూ
పట్టునిరల్పకంకణవిభ ల్నయనోత్సవ మాచరింపఁ గా
మట్టపుటూర్పుల న్మెఱయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరవము ల్జవముల్ ఘనపక్షనిర్భరా
సంగమునం బహుప్రసవజాకలరేణువు లంటిరాఁ బరి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ. సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రిము ఝుంకృతిభాగలీనభూ
త్కరణమిషంబునై సొగసు గాడ్పులదూలుచు మాగుతుండిక
ద్విరసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
ప్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నొదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దళుక్కున న్బెళుకుబేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలచోటులన్నియును జేకొని బంధురధారసత్త్రసం
వరణబలంబు నిత్యమయి వర్తిల దారుణమైనవిక్రమం

బుధభవనంబులం బొదల నున్నమహామధుపుంగలంబి దు
స్తర మగునచ్యుతాతిశయచక్రము గన్గొని సంభ్రమింపుచున్. 138

చ. మిళితగరుత్కలాపముల మించుకుమారశిలీముఖాళిసోఁ
కుల నిజహృత్పుటు ల్విరిసి కోమలపత్రవిశాలలోచనాం
చలముల నీరుగప్ప మతిజాబిలిరాకకుఁ గాక మోహినీ
కళ దుళకించుపద్మినులఁ గన్గొని గంధగుణంబు నొందుచున్. 139

చ. తనభువనప్రశస్తబలదర్పమునం జననీక నిచ్చలుం
దనివిసనం బహుద్విజవతంసములం దినుమ న్నిరంకుశ
ధ్వనిఁ బ్రకటైకచక్రసవిధస్థలిఁ గ్రాలుబక న్మహత్తరు
ల్దను శిరసావహింపఁ దగులావరిఁ గన్గొని తెల్వినొందుచున్. 140

ఉ. బారులుగొన్నసీరకణపంక్తులు క్రొచ్చవిరచ్చదెల్ప నిం
డారినకేసరంబులు శుభాక్షతరేఖఘటింప సారకా
సారవధూటిసాంగజవసంతున కీనమరించు పచ్చరా
యారతిపళ్ళెరంబుల క్రియం దగుతామరపాకుఁ జూచుచున్. 141

వ. కదియంజని ప్రహృష్టచక్రంబుగావున రాజహంసోపలాలితంబయి సిద్ధసంతాన
వేష్టితంబుగావున మత్స్యకూర్మకుక్కుటాద్యాసనభాసమానంబయి విడంబితశంబ
రారంభంబుగావున నాక్రాంతపాఠీనాంకంబయి కుముదప్రకాశోదయంబుగావున
నావిష్కృతపుష్కరంబయి యలరుచుండుట కలరుబోండ్లు. 142

క. ఒసపరినడకలు మృదుసా, రసవిసరవిజేత లగుకరంబులు గంధో
ల్లసనము కొమ్ములు నమరఁగఁ, గుసుమాస్త్రునిమదపుటేనుఁగులగతిఁ జెలువల్. 143

వ. కాసారంబు ప్రవేశించి. 144

మ. పొగడంజొచ్చినభంగి రత్నవలయంబు ల్మ్రోయఁ జేయెత్తి కెం
జిగురుంగొమ్మునపైచె నోర్తు నొకరాజీవాస్య యవ్వాటునం
బగులం గంచుకముబ్బి చన్నుఁగవ చూపట్టె న్నఖాగ్రంబులం
దగ నండంబులు వ్రచ్చి వెల్వడునరిద్వంద్వంబుచందంబునన్. 145

ఉ. పూని ఘటాత్కృతు ల్మరయ బుజ్జటకొమ్మున నీరునించి యకా
రా నెఱజాణ నా నొకధరాకటి యొండొకబోటిపైప నె
మ్మె నదరంటఁ దాఁకి నెటిమించినఁ బయ్యెదవ్రయ్య నంత న
మ్మానిని యొప్పె పేరొఱఁ దెమల్చినపూవిలుకానివా లనన్. 146

చ. మరువిరితూపురూపుపసమాపు నొయూరపుఁజూపు సూరెలం
దిరువులుగట్టి విభ్రమవతీమణియోర్తుక యన్నుగన్నులం

దొరలజలంబుఁ జల్లె నది దోయిటవక్త్రముఁ గప్పె రోహిణీ
చిరవిరహార్తి నొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. 147

ఉ. చేనొకబోటి కెంజివురుఁ జిమ్మనగ్రోవియొనర్చి తమ్మిపూఁ
దేనియఁ బీల్చి సోగవిరిదండుగ నొండొకకొమ్మ జిమ్మనె
మ్మే ననుకైన నమ్మెలఁత మించె జగంబులు గెల్చి కాంతి రే
ఖానియతి న్మరుండు గడుగం గడుఁగ్రాలు మెఱుంగువాలనన్. 148

చ. పొలఁతుకయోర్తు గెంజివురు బుఱ్ఱటకొమ్మన ద్రుక్కి నొక్కనె
చ్చెలి చలివీడివైవ నది చిత్తజుఁ డేడ్తెఱఁ జూచి వైచు కే
ఎలకరవాలసంహతులవై ఖరి గానఁబడంగ దానికే
ఎలకరవాలసంహతులపంచి వికావికనవ్వెఁ గ్రొవ్వనన్. 149

చ. విరహులమారుమాయఘునవీరబలం బని పాంథకంధర
ల్దఱుగురమాకుమారు నడిదాలనిరాగవియోగజాతకా
తరగుణదాత్రమన్మథపతాకని తేంట్ల నదల్చి కమ్మదా
మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. 150

చ. గతి యతివేలరాగకరిగా నెఱిగాంచినవాలువాలముల్
ప్రతిరహితాంఘ్రులం బెనఁగఁ బైపస ముద్దులుగుల్కు సమ్మద
స్థితి మితిమీఱఁ గొమ్ములను జేతులు పుష్కరలక్ష్మి దెల్పఁగా
హితసరసిం జయించి రలయింతులు కంతునిదంతులో యనన్. 151

ఉ. కొమ్ములతోడిహస్తములు గుత్తపుముద్దెలముద్దుగుల్కు పాం
దమ్ములనంగవృత్తిజఘనద్వయసాంబులనిల్వ రేఁగి పైఁ
దుమ్మెదలాడఁ జూడ నవదోహదధూమమిళల్లతావితా
నమ్ములజాడఁ గుందరదన ల్గననైరి మనోహరాకృతిన్. 152

ఆ. ప్రపవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, మనిమియో యెఱుంగ విసువులేక
తొరసించి ముద్దుతమ్ములఁ జివురాకు, బోండ్లు కొలనుసొచ్చి పుచ్చుకొనిరి. 153

క. నాళీకజైత్రనేత్రలు, హాళిం గేళీసరోవిహారశ్రీలం
దేలి కటీఘటితపటీ, జాలములు కలాపవేషసంగతు లమరన్. 154

ఉ. మందమరుత్కిశోరహతి మవ్వపుఁ దేనెలజాలువారుపూ
బందిలిక్రిందఁ గప్పురపుఁబల్కుల దిద్దినగద్దె నిందిరా
నందనునిల్పి వృత్తజఘన ల్రతివర్ణితభారతిం దదా
ళిందమునం ఘటించి కదళీదళగర్భలతాంతసంతతుల్. 155

క. కరములఁ గైకొని చెలువ, ల్మరుజాపగుణీకృతభ్రమరుఁ బ్రతివినతా
మను జైత్రార్పితమణిచా, మరు నారాధించి రప్రమత్తప్రజ్ఞన్. 156

క. ఆరాధ్యద్యుమణిప్రభు, నారాధనవిధులఁ దనిపి యతిశయవర్షా
ధారాధరవేణుల మధు, ధారాధరఫణితి వినయతాయుత లగుచున్. 157

సీ. తలయేఱుపట్టించె నెలదాల్పునకు భవత్క్రాంతనిష్క్రాంతహుంకారరవము
వికటిలత్రోటికోటికి దెచ్చె భారతీకాంత దావకభయంకరశరంబు
ముష్కనిర్భేదనంబున సాధుజేసె నీవైరంబు మఱిదివ్యవృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీ నెఱదాడిఁ జేరఁడు గ్రహరాజశేఖరుండు
తే. నీప్రతాపాగ్ని దపియించి నీరజారి, సంశ్రయించె సురాచార్యశరణభూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు, శంబరాసురవిమతహింసారిరంస 158

సీ. వివిధాగమాంతప్రవేశచాతురి నెన్నదగుశుకాదులు వినీతతఘటింప
మహిసురాప్తిసుహృత్తమహిమ గాంచినయుత్తమాళులు హితవృత్తి ననుసరింప
ఘనదానవేగరాగముల మీఱినజగత్ప్రాణుండు నీమనోరథము గడప
నాశువాగ్గ్రహణమేధాశక్తి మాధవాదృతి భజించినమహాద్విజులు గొలువ
తే. కువలయప్రీతికాముఁడై నెవఁడు రాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి, వేమునకు బోయుపాలయ్యె వృద్ధసేన. 159

ఉ. పూతమరందబృందకరము ల్కరము ల్ప్రతిపర్వసంధిసం
జాతమధూద్ధతంబు విలుసారసమీరకుమారవారణో
ద్ధూతసుజాతిచూతరసతుందిల వారరమాకుమార నీ
చేతిగుణంబుమాన వదెచేతిగుణం బిటులయ్యె నక్కటా. 160

సీ. ఆర్తివహించు నీయస్త్రపీఠమునకు నిలుపుగన్నులనీక నివ్వటిల్లె
నతిముక్తమగుతావకాయుధంబున కహో దొరకె జండాలురతోడిమైత్రి
ప్రంతఁబాయని భవద్ధ్వజవాశ్చరమునకుఁ గలిగెఁ బేరలుఁగులఁ బొలిసి పోవ
బుట్టుగుడ్డైన నీబూమెఱ తేజికిఁ దగిలె మహావినీతప్రతీతి
తే. యకట జాతికిఁబాసిన యనుఁగుఁజెలికి, నెసఁగె మఱివేళవేళ మానిసితనంబు
నొడలుమాపిన నీకయ్యె నుగ్రకృత్య, మంగభవనిందితులకు మే లావహిలునె. 161

మ. అమదప్రక్రియ మూఁడుగాళ్ళజరతుం డైయున్నతంద్రిం ద్రివి
క్రమునిం దమ్ములఁ జేరి తత్ప్రబలపత్రచ్ఛాయ వర్తించునా
దిమసాధ్వి న్రమఁజేర రమ్మనక యుద్వృత్తి న్విజృంభింతు నీ
తిమనీషోదయలాభమెట్లు జనికర్తృద్రోహియౌ వానికిన్. 162

ఉ. అల్లనఁ గాచి మిత్త్రగృహ మారటఁ బెట్టుసఖుండు నీతిపాం
దొల్లఁడు మంత్రిమానులకు నొప్పమిఁ జేయురథంబు నీవు నం
బల్లవధర్మ మూఁది రతిపైఁ దమివర్తిలు దట్టినీకు ను
త్ఫుల్లదయానయాదిగుణము ల్జనియించునె శంబరాంతకా. 163

వ. అని యనంగు నంగనారత్నంబులు దూఱి తన్మాతులుండగు నీతజారిం జేరుకొని. 164

ఉ. నీదయ పంచబాణశరనిర్భరతాపదవాగ్ని గ్రాఁగి పో
నీదయ నీదయోదయసమృద్ధి సహావెదచల్లుచుండుఁ దా
నీదయ సేఁదఁ దేర దొకయింత యిదెక్కడివింత నేఁడు నీ
పాదములాన మావికచపంకజనేత్త్రకు సారసాంతకా. 165

ఉ. కాలగతిం ద్వదీయజనికర్తప్రతిక్షపము న్గరాళకో
త్తాలకృపీటజన్మపరితశ్శిఖలం గడు గ్రాఁగు నాతనిన్
బోలి కళంకివై మొదలఁ బుట్టినవానికి నీకు శైత్య మే
వేళ జనించు విత్తొకటి విత్తినఁ జెట్టొకటౌనె జాబిలీ. 166

చ. పరుషమహాకృపీటభవభావము నీయెడ సత్య మత్తెఱం
గరయక నిన్ను శీతకరుఁ డందు రటేని సుజాతశీతల
స్ఫురణ పయోధికిం గలదె పొంగుకళంకము పేరఁ గ్రొంబొగ
ల్గురియుదె మింటనాలికలు గ్రోయుదె లోలకళాచ్ఛలంబునన్. 167

చ. పరిధిమిషంబునం గుడుసుపడ్డశరాసముఁ బూని శైత్యవి
స్ఫురణమెఱుంగులీను ఘృణిభూరిశరంబుల వేఁడిగా రహిన్
విరహిజనాళి నొంచెదవు వేఱె మనోభవుఁ డేల నీవయిన్
సరసతలే దనంతపదసంశ్రయ మేమయిపోయె జాబిలీ. 168

ఉ. గోత్త్రులు రాకపోక నినుఁ గోల్కొననీరు దురంతశీతరు
జ్జైత్రదృఢాంబరాశ్రయము మానవు నిన్న విరోధియు నీకళా
మాత్రవిభూతి నిట్టియిడుమంబడితో హరిణాంక వారిరు
ట్పత్త్రసుగంధలం గిరణపాతనశాతనరీతి నొంతురే. 169

ఉ. కందళితానురాగములు గావు మనంబులు విన్నయంతలో
నందఱు పారవశ్యపదమందురు చల్లఁదనం బొకింతలే
దిందున శంకరాభరణ మెట్లయితీవు శశాంక నీపదం
బుం దుది నంతశూన్యమగుఁ బో వివరింపఁగ మాటలేటికిన్. 170

చ. సదవనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియు న్సఖులబ్ధపటుప్రసాదసం

పదబలవత్తమోదళనపాండితియుం దగురాజవైన నీ
కదయత కామినీజనులయం దుదయించుట పాడియే శశీ. 171

మ. కృతదక్షాపకృతి న్మహామఖముఁ గళంకి న్సోదరీమందిర
ప్రతిపక్ష వ్రజనీచరుం గురుకళత్రప్రాప్తభూయఃకళా
పతను న్ని న్నిరసావహించెఁ ద్రిపురప్రత్యర్థి సర్వజ్ఞు లా
శ్రితదోషస్మృతివిస్మృతివ్రతులు గారే రోహిణీవల్లభా. 172

ఉ. మేదిని నర్జునస్ఫురణ మించి చరించుట సింధుచక్రర
క్షాదృతి నీ కనంతతిలకాంతమువో హరిణాంకకృష్ణప
క్షోదయము న్గురూపకృతియుక్ ఝషకేతువిరోధివిగ్రహా
హ్లాదముతే దదేమి చెప్పుమా వెఱఁగయ్యెడు నీకు నక్కటా. 173

వ. అని హాలాహలవిరోధి శిరోధిగృహమేధి యగు నవ్వనజవిరోధింబలికి చెలికిఁ దాపో
పశాంతిఁ గానక వరారోహలు గంధవాహు నుద్దేశించి. 174

సీ. కాండభృద్ఘనబాధ గాసినొందినమిత్రు నోమవే సుఖవృత్తి నుల్లసిల్ల
మోచివచ్చినకార్యములచోటనోసఁగవే కుసుమబాణునకు నెక్కుడుధనంబు
చెలిమిఁ బక్షీకరించినమహాశిఖికిఁ జేరుపవె లావరిసమారోహణంబు
మొదలనిన్ను సహస్రముఖములఁ గొనియాడుచక్రి కీవె నితాంతసత్త్వగరిమ
తే. నీవిహారంబు దాక్షిణ్యనిర్భరంబు, నిను సదాగతిగాఁ జూచు నిఖిలలోక
మోజగత్ప్రాణ నీవంటియుత్తమునకు, నర్హమే పాంథయోషానిబర్హణంబు. 175

మ. సలిలాహారుల గణ్యపుణ్యతరులం జంద్రాస్యలం గాక నీ
బల ముత్కృష్టబలాధినాథులఁ దరల్పంజాలునే నిన్నుఁ గే
వలముం దైవము దెచ్చి మూలఁబడవైన న్మించు నీలావు లం
కలపాలై చన నీఘనంబు దునియల్ గా కృష్ణవర్త్మప్రియా. 176

చ. గరళగళప్రసాదమునఁ గన్నసుతుక్ హరివంటివానిఁ గే
సరిసతి కీవె తజ్జఠరజజ్వాలనైకశిఖాప్రశాంతికై
పరుషగతి న్మహామునులఁ బల్లటఁబెట్టవె యట్టినీకు నో
కరువలి మేఘవేణికల గాసియొనర్చుట ధాత్రిఁ జిత్రమే. 177

ఉ. కొమ్మలచోట నీకుఁ బ్రతికూలతపుట్టుటయెంత చొక్కపుం
దమ్ముల సాధుమత్సరమునం దలఁకింతువు నిచ్చలుం బరా
గమ్ములచేఁతు వేమఱవు కాలుపదం బిటువంటినిన్నుఁ దా
నమ్మక చెల్ల సర్వభువనానువుగాఁ దలపోయఁ బోలునే. 178

వ. అని సమీరు దూఱు వనసరంబున నలరాత్రి. 179

క. స్మరమృగయు విశిఖబాధా, పరవశయాయి యున్న దానిఁ బద్మిని గాఢ
త్వరఁ బరుషరీతి రుచిమత్కిరణనఖాగ్రములఁ జంద్రకేసరి నొంచెన్. 180

క. యువతికిఁ బ్రాణంబయ్యుం, బవతుగతిం బ్రోఁదిసేసె మలయక్షితిభృ
త్పవమానుఁడు దూరితర్తై, పవమానుఁడు మోహదావపావకశిఖలన్. 181

వ. ఇట్లు మారతారేశకుమారసమీరబాధావిధురయై యమ్మధురభాషిణి శోషిల్లునుల్లం
బున నొల్లంబోయి నెచ్చెలులఁ గలయ నాలోకించి. 182

సీ. కనలుచుక్కలరాజుకంటఁ బుట్టిననేమి గాడ్పుపేరెమువాఱుఁ గాకయేమి
కంతుఁ డాకృతిఁ బెంచుఁ గాకయేమి సుజాతకలితుఁడై మధువుండుఁ గాకయేమి
హంస మాపగవారికై పోవుఁ గాకేమి గండుఁదుమ్మెద మ్రోయుఁ గాకయేమి
చిలుకవాదులకు వచ్చినవచ్చుఁ గాకేమి కలకంఠి గలహించుఁ గాకయేమి
తే. కమ్మచిగురాకుచే మించుఁ గాకయేమి, కళిక లంతంత మొనఁజూపుఁ గాకయేమి
వెఱపు నాకేల వెన్నెల వెల్లిద్రెళ్ళి, ప్రాణసఖులార వలవంతఁ బాయుదాన. 183

క. అని మోముదమ్మి వాడ, న్మనసిజశిఖిమునిఁగ సకలమర్మస్థలముల్
దనువ్రాటాడం గన్నియ, పెనుదెగువ న్నుబ్బతిలిన భీతిలి రతివల్. 184

క. కామాస్త్రములకు నాళీ, గ్రామణి వైషమ్య మొదవుఁ గా కెప్పటికిన్
సోమకుమారీమణి యీ, కౌముది దానెట్లసౌమ్యగా నేర్చునొకో. 185

వ. అని జననాథకన్య నాలోకించి. 186

సీ. దరహాసలేశధిక్కరణ మున్నదియో నీవంక వెన్నెల కేల వహ్నిఁ గురియఁ
గినిసిమాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వగావళి యొనర్పఁ
బ్రతిపక్షి యని తిరస్కృతిఁ జేసితే సాధుపికమున కేల వాబిఱుసుఁ జూపఁ
జూడఁబోలనిచూపుఁ జూచితే చంచరీకమునకు నేల ఛిద్రములు వెదక
తే. గోచరింపక యొకమూలఁ గూలి చనక, మందతవహింప కిట్లు త్రిమ్మరఁగ నేటి
కని యుదాసీనుఁ జేసితో యభ్రవేణి, యనిలశిశు వేల వీచివాలయ్యె నిపుడు 187

సీ. మనసుగన్న రమాకుమారికాసుతునకుఁ బూర్వాశ్రితుం డైనపూర్ణశశికి
జీవమువంటి దక్షిణసమీరమునకుఁ బేరైనకుసుమాస్త్రబృందమునకుఁ
బలుకుమారనిముద్దుచిలుకకు నెయ్యంపుఁ బైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళి యయిన గయ్యాళి తేఁటికి బెట్టు చెట్టైనలేఁ బ్రోఁదిచిగురుమావి
తే. కకట భయమందవలసె హా యనఁగవలసె, బెగడుపడియుండవలసె గంపింపవలసె
నాతురతఁ గూరవలసె బిట్టలయవలసె, జలదరింపఁగవలసె వే జడియవలసె. 188

ఉ. చేరువమావికెంజివురుచేతికి లోనుగదమ్మ పద్మకాం
తారమరాళిమానసము నమ్మినదింతెగదమ్మ కంతుబ

ల్వాయనమైనచిల్క మిగు లాతగులాయె మెఱుంగునష్మ నీ
పైఁబడష్మ మల్లికలు పల్లవపుంపఁగ నేల వానికిన్. 189

ఉ. దారుణభంగిఁ బేర్చినతాపదవజ్వలనోష్మ మంటికం
తీరవమధ్యతాంతదశ నీతను వల్లవహించినం దగుం
గైరవసోదరస్ఫురణఁ గాంచిన నీనిడువాలుగన్నులే
లారజనిం గుభృజ్జనికళానిధిరాకకుఁ దల్లడిల్లెడిన్. 190

క. అకటా యని చింతింపుము, లికచకచ త్ర్లిలువ సంబళింపక శుకముం
బికము న్మలయానిలశా, బకము న్మదిఁ దలఁచి వినయపాటవ మమరన్. 191

ఉ. మాటకు రాదు ప్రోదిశుకమా యొకమారు జయింపరానికై
లాటము జేసె దేటికి భళాపికమా యిఁక మాను బోటి నీ
సాటిరొ ప్రాణమయ్యె నదె చల్లఁదురే యిటులైన జోటి రొ
చ్చోటికిఁ బోవు నీచులన చూపననా పవనాఘునాద్మతిన్. 192

క. అనిపలికి కలికిచెలువలు, మనసిజతాపాతపోష్మమందద్యుతియై
తనరువధూతనువల్లిక, ఘనశీతలరీతిఁ దేర్పఁగాఁ దగు ననుచున్. 193

చ. చెలువలు కిస్లయమూలములు శీతము లంజ్వలదంశుమత్పలా
దళములు వెన్నెలంబులు సదామృదులాకృతి మంచివారిలో
మెలఁగుమృణాళముల్ గనము మెచ్చొదవించుమధూళి మాటలో
పలియవి యన్నిటం జెలికిఁ బంచశిలీముఖతాప మారదే. 194

వ. అని శీతలోపచారంబు లాచరించిన. 195

సీ. ననుమావిచిగురుపానుపు మహాతను శస్త్రశయ్యగాఁ దలఁచుఁ గంజాతనయన
కడిపోనివిరులకంకటి గణించును ధూతకంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపుగుంపుమపువ్వుతలిపు మంగళివాగ్నిశిఖగా విచారించుసింహమధ్య
శిరముకప్రపుఁబలుకు సెజ్జ సొక్కుఁగాయుశరముగా వగచుయోషాలలామ
తే. మంచిపడమటిపన్నీరు మకరకేతు, విషముగా బుద్ధి నూహించువిద్రుమోష్ఠి
తావిపుష్పవడి శంబరాంతకుపరాగ, మని వితర్కించుఁ బలవ మోహైకకలన. 196

వ. ఇట్లు మనోభవమోహదాహంబునం బొక్కి పొరలుచున్నకన్నియ నెచ్చెలులు నికేత
నంబునకు మరలఁ దోడ్కొనివచ్చిరంతఁ గొంతకాల మరిగిన నొక్కనాఁ డేకాంతం
బున విద్యామంటపంబుననుండి చదువుఁ జెప్పుచు దదీయసౌందర్యవయోవిలాసంబు
లీక్షించి మన్మథాతురుండై మందుండు భువనమోహిని కిట్లనియె. 197

చ. నిరవధికత్వరం బఱచి నీచనుగొండలసంధిడెందపుం
దెరువరిమారచోరనిహతిం బడి మోహవిదాహవేదనన్

బారెడుఁ దేర్పుపుణ్య మిదిపో యధరామృత మిచ్చి యిందునం
దరసినగల్గునే పరహితాచరణప్రతిమానధర్మముల్. 198

క. నవలా తావకమోహా, ర్ణవ మేమిటగడతు దుస్తరము వివరింపన్
భవదీయస్తనకుంభ, ప్లవ మబ్బినగాక యీవిపత్సమయమునన్. 199

క. అనిద్రాసుఖితంబులు, గానేరవు లోచనములు కంఠద్వయసం
బై నీలావణ్యరసం,బో నవలా త్రేన్పు వెడలకుండుటవలనన్. 200

క. హారవిలాసము గలని, న్నారసి చీకాకుపఱుప కతనుఁడు ముక్తా
హారవిశేషము గలన, న్నీరసమున గాసిసేయు టీ వెఱుఁగవొకో. 201

క. గాఢరుచి న్రుచిరం బనఁ, గూడదు నీయధరము దరహసచుంబితకా
మ్రేడితము కానిచో నే,లా డాపునఁ జూచువారలకు నోహరుణన్. 202

క. ఇన్నియును జెప్పనేటికిఁ, బన్నినమరుగాసివాసిఁ బాసితి నో రా
కన్నియ యన్నియమెఱయం, గన్నెఱికప్రభితు నాకుఁ గరుణింపఁగదే. 203

క. అని దీనాననుఁడై మో,డ్చినకరములతోడఁ బ్రియముఁ జేకొ మ్మనుచుం
దనుఁ బ్రార్థించుధరాసురుఁ, గనుఁగొని రాజన్యకన్యకామణి పలికెన్. 2.4

క. గురుఁ డనఁగఁ దండ్రి యఘుసం, హరణగుణా శిష్యురాల నైనప్పుడె కుం
తురమేర దప్పి కామా, తురబుద్ధిం గోర్కి సేయుదురె నావోటన్. 205

మ. నరకద్వారకవాటభేది యవిమానప్రాప్తిమూలంబు దుః
ఖరుజాపథ్యము పుణ్యలోకగమనష్కం బస్ఖలత్కీర్తి సా
గరమంథాద్రి జనాపవాదహుతభుక్కాష్ఠంబు సత్కారసం
హరణోజ్జృంభము గీడుగాదె పరభామాసంగ మెవ్వానికిన్. 206

ఆ. నీతి సాధువృత్తి నీయది ధరణీసు,రుఁడవు వేదపారగుఁడవు ధర్మ
తరులతాపరశ్వథము చెల్లఁబో యిట్టి, నీచచిత్తి మెట్లు నీకుఁ గలిగె. 207

తే. ఏను రాజన్యకన్యక నితరజాతి, భామగా నెట్లుపొసఁగు నీపాపవృత్తి
భూసురుఁడవైన యిది నీకు బుద్ధిగాదు, బ్రహ్మహాని తపోహాని ప్రాణహాని. 208

వ. అని యనేకప్రకారంబుల బోధించుచున్న యన్నీలవేణికి బ్రాహ్మణుం డిట్లనియె. 209

ఆ. నీవు మాటలాడనేర్తువు గురుఁ డేల, చెప్పుకొను విరాళి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన, పలువనలువ గూఁతుఁ బట్టికొనఁడె. 210

క. మరుబారిఁ బాటి చంద్రుఁడు, గురుభామం బ్రేమఁ బిలుచుకొని వినుతబుధుల్
పరిణతముని విబుధబుధుల, గరిగమనాగమనలీలఁ గాంచుట వినవే. 211

క. గౌతమభార్య నహల్యన్, శాతోదరిఁ బదరి పర్ణశాలం గాలా
తీత మొనర్చియుఁ గూడిన, యాతని కింద్రునకు నేమియయ్యెం జెపుమా. 212

ఆ. ఇట్టిపట్టిసుద్దు లేటికి నీయంగ, సంగలాభ మైన జాలుఁ దెలుప
వెలుప మెఱసి మీఁదఁ బఱతెంచు నత్యుగ్ర, పాపమునకు నరకకూపమునకు. 213

చ. కడపక నీవు నాపలుకుఁ గాదని వేదనిసర్గమార్గమం
దడిగెద వేని మేనియడియాసఁ దొఱంగి లతాంగి ప్రాణముల్
విడిచెద నీవుచూడ నలవేవడిఁ బాపములోన దీనిలో
విడిదలగాక వేకలఁచి వేచెడి దెయ్యది చూచితో మ్మనన్. 214

శా. ఆఘోరోక్తులు వీనులం బడిన నాహా పుట్టిరాపట్టిని
గ్మోఘం బీయనమాట తుచ్ఛదురితంబు ల్ధర్మకర్మక్రియా
శ్లాఘ న్మాన్పకొనంగవచ్చుఁ దుదిఁ ద్రెళ్ళంబోనియా బ్రహ్మహ
త్యాఘం బేమిటఁబాయు నాకొకయుపాయం బెద్ది యీచేతనన్. 215

క. కులగోత్రశీలములకు, న్వాలి దైనం దగు మహోగ్రవిప్రప్రాణా
నిలవిచ్యుతి కే నొప్పం, గలదా నన యింతకంటెఁ గలుషము గలదే. 216

క. అనుచితకార్యము లేమే, నొనరించినయత్న మొప్ప నుత్తమజను లా
ర్యుని విప్రుని విధ్వస్తా, త్ముని నెప్పుడు సంతరింపుదురు మేలగుటన్. 217

ఉ. కావున నొండుపాయములుగావు మహీసురరక్షణంబ మే
లై విలసిల్లు నేమితెఱఁగైనను మంచిదె యంచు బుద్ధిలో
భావనఁజేసి యచ్చెలువ పల్కె ధరాసుర రెండుజాలలో
నీపది కేగుదెంతు సరణిం జలియింపకయుండు మిత్త్రతన్. 218

వ. అని యతండు విశ్వసించినట్లుగా నందులకుఁ గొన్నిశపథంబులం బలికి యక్కలికి
నగరికరుగుచు నపరాహ్ణగతుం డగుగగనమణి నాలోకించి కీర్తించి కరంబు లురో
జాగ్రంబులఁ గీలించి యిట్లనియె. 219

క. ఓలోకమిత్ర యొకరు, జాలయ నీకులముదాన నవనీసుర దు
శ్శీలంబు మాన్చి యిట నా, యీలువు చెడకుండఁ బ్రోవవే నేఁ డనుచున్. 220

క. చేరఁ జనుదెంచి యలసర, సీరుహహితుఁ డబల యట్లచేయుదు చింతా
భావంబుఁ ద్రోఁచి కదలుము, గారమునకు ననుచుఁ బఱచె గగనంబునకున్. 221

వ. ఆసమయంబున. 222

చ. ఇనుఁడు వసూద్ధతుం డరయ నెవ్వఁడు వానికి నీతిలేదు వీఁ
డినుఁడు వసూద్ధతుండు నయమెయ్యది తద్బిసినీదివారతిం
దనిసె ప్రదోషకాలమునఁ దానిదె వారుణి నానియున్నవాఁ
డని యలుకంబలె న్మరలె నా నడచెం దగ ఛాయ ప్రాచికిన్. 223

సీ. ఇవి చెందిరికచీరలవుఁగదా తిగిచికుచ్చెలఁబోసి కటులఁ గీల్కొలుపవచ్చు
నివి కుంకుమరసంబులవుఁగదా గబ్బిగుబ్బలజోకటంబుగా నలఁదవచ్చు
నివి చెంగలువసెజ్జలవుఁగదా కౌఁగిళ్లఁ బ్రియులుండ మెఱసి నిద్రింపవచ్చు
నివి చిగిర్చినమావులవుగదా కటికివేసవులనీడలఁ గ్రీడ సలుపవచ్చు
తే. నివి సరోజాతరాగంబులవుగదా బెడంగడరు పేటికలఁ బెట్టి డాపవచ్చు
ననుచు వరుణావరోధకామినులు పలుక, నస్తగిరిఁ బ్రాఁకె జరఠారుణాతపములు. 224

మ. తనచిత్తంబునఁ బద్మినిం బవలు పొందన్ వారుణీకేళికిం
జనఁ బైకొన్నప్రదోషపీడకు సహింపన్ స్నేర్చె నింకెట్లుగా
దనువో మంగలవాఁడనంచు భృగుపాత్రప్రీతి సేతెంచెనో
యన సేవించె సరోజబాంధవుఁడు ప్రత్యగ్భూమిభృత్కూటమున్. 225

తే. అపరపర్వతశిఖరసింహాసనమున, గొంతదడవుండె గ్రహరాజు గ్రుంకుటుడిగి
సమయరమ మజ్జనంబాడి సాగరంబు, దండనుంచిన కుంకుమపిండ మనఁగ. 226

చ. కరటనిషక్తఖర్జు వడఁగం జిరగర్వసమగ్రమంజన
ద్విరదము పాయుతన్మదస్రుతిం బొడుకెక్కినయస్తసానువం
దరదముఁ జారఁ బైనడుగు లానక యుర్విఁకి డిగ్గ నుద్ధత
త్వర ననఁ గ్రుంకె భానుఁ డవధాననికుంచితభానుహస్తుఁడై. 227

సీ. పరిపక్వబింబవిభ్రాంతి దవ్వులరాజకీరడింభములు గ్రుక్కిళ్లు మ్రింగఁ
బ్రత్యగ్రశోణితభ్రమ నుపస్థితములై పంచాననంబుల బయలు నాక
పల్లకీపల్లవచ్ఛదనశంక సగంధకరులు రిత్తకురిత్త కరము సాఁపఁ
బుంజీకృతక్రవ్యబుద్ధి నిష్ఠురవృద్ధశార్దూలములు నోళ్ళు చప్పరింప
తే. గైరికద్రవవిచికిత్స గాన నాట, పాటలోష్ఠులు పాలిండ్లఁ బ్రాముఁ దివురఁ
బ్రత్యగవనీధరంబునఁ బ్రాకుడెంచె, నపుడు దివసావసానసంధ్యామరీచి. 228

తే. చరమదశఁ గన్నవాసరస్వామిఁ దలఁచి, తమ్ములామోద మటివంతఁ దలఁకుచుండ
నస్తముపగోత్రమయ్యురాగాప్తిఁ బొదలె, మొదలఁ బాశ్చాత్యకృత్యమట్టిదయకాదె.

తే. సద్ద్విజశ్రేణి దివసావసానవేళ, చలువఁ దేరు వనప్రదేశములఁ జేరి
కన్నులరమోడ్చి విస్పష్టగతులు మీఱ, నారవవ్యాజమున జపం బాచరించె. 230

సీ. తావులకొండనెత్తము డిగ్గి చెంగల్వదోనల చల్లనినీటఁ దొప్పదోఁగి
పరిగొన్నపచ్చకప్రపుదుమారము రేచి తరుణపల్లవపరంపరఁ దెరల్చి
వికసితప్రసవజాలకరేణువులవంటిగంధసంపద దేటిగములఁ బ్రోచి
బలిమి గానవపరంపరల నుజ్జుటలూచి తీవపందిళ్ళలోఁ దిరిగితిరిగి
తే. యెండ పొడదూరక పగళ్లు నిర్లు గవయు, తియ్యమావులక్రేనీడఁ దెరువుసాగ

కల్లనల్లనఁ జనుదెంచె నతనుభద్ర, వారణంబన సాయంసమీరణంబు. 231

చ. సరసులసంగతిం గలుగుచక్కనితమ్ములఁ జేరఁబోయి క
న్నరమొగిడించి వ్రాల్చుచిగురాకులడగ్గఱి పత్త్రము ల్నిశా
కరదృషదోఘముల్ గదిసి కప్పుపడం బరిముక్తవృంతకే
సరములఁ జెంది కందునొకజక్కవ దా వియోగవేదనన్. 232

సీ. నిండారుకమ్మదేనియ మజ్జనంబాడి కడిమిపుప్పొడివన్నె మడుగుఁగట్టి
రేకుగన్నుల జంచరీకాంజనముఁ జేర్చి తనావల్లి ఫేనచందనముఁ బూసి
తుంటలేఁ తూఁడుజేతుల నూర్మికలు దాల్చి జలకణమౌక్తికచ్ఛటలు పూని
మొగ్గపాలిండ్లసొంపున హిమాంబువునుంచి యామోదసంపద నతిశయిల్లి

తే. హంసకంబుల నిజపదం బలవరించి, భువనమోహన మైనవైభవముఁ గాంచి
కలువవిరిబోడి రాజురాకఁ దలంచి, పొలిచె వాసకసజ్జికా స్ఫురణ నపుడు. 233

తే. ఝంకృతివ్యాజమున హాళిసన్నుతాళి, యాఁకడింపఁగఁ దనకన్నవారిలోన
ననవధిక్లాంతిమిత్త్రమోహార్తి ఖిన్న, తమ్మికొమరాలు పత్త్రనేత్త్రములు మోడ్చె.

సీ. కనలుసంధ్యార్చిఁ బేర్చిననభఃకరిమేన బొటములెత్తిననీరుబొబ్బలనఁగఁ
గాలమాంత్రికుఁ డంధకారదానవబలిక్రియకు గాల్చినపేలగింజలనఁగఁ
దాండవభ్రమిఖమూర్ధజకుఁ డంజలిపుటంబున విధిర్చినకమ్మపూవులనఁగ
మైరవసింధుసంపర్కశర్కరదేవమును లోనర్చినలింగమూర్తు లనఁగఁ

తే. గమలగర్భాండగోస్తనీకాయమాన, జటిలపరిపక్వఫలగుళుచ్ఛములనంగ
నఖిలజనలోచనోత్సవం బాచరించెఁ, దామరసవైరికులదారతారకములు 235

ఉ. స్నేహవిరక్తిఁ గాలగతిచేఁ గని మిత్త్రుఁడు చామగక్రియా
మోహాతుఁ డౌటఁ గన్గొని ప్రమోదవిధిం దనుఁజేరె నీగురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయనిపూనినశక్రదిగ్గగ
న్మోహిని మోము విన్నఁదనమో యనఁ బాండిమదోఁచె నెయ్యెడన్. 236

సీ. బలభిద్దిశావశాప్రతిమ గామినిముద్దుగులుకుటీరికనవ్వు తెలివిచెప్పి
యుదయమస్తక్రీడ నూడికోలులు మోవఁ గూలినచాదంతికొమ్ముఁబోలి
గగనవాహినిరొంపి గాడికొండొకదోఁచు కమలాపుత్త్రరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణికరంబున నెత్తిమూమ క్రొన్నెమలీకసురటి నొరసి

తే. యంచు గనుపట్టి మఱియించుకంత మెఱసి, సగముపర్యాయకమున సాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ, జదలఁ బూర్ణకళాసీమ చందమామ. 237

సీ. అది సుధాకరబింబమా కాదు మడికొనువన్నె వేలుపుటన్నవత్తిగాని
యది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలుదంతపుటరిగోలుగాని

యది నిండుచలివెలుంగా కాదు మబ్బుటేనుఁగుఁదోలు తెఱనోటి మొగము గాని
యది చకోరములవిందా కాదు దుగ్ధాబ్ధికడ జనించిన వెన్నకరుడు గాని
తే. యది నిశామిత్రమా కాదు మదవియుక్త, యువఘురట్టశిలాపలయంబు గాని
యని జను లూఁచి కీర్తింప నతిశయిల్లెఁ, బ్రోవజాబిలికలువపూఁబోడికలిమి 238

సీ. ఇనకరాంకురముల కెడయాని మ్రాని క్రీనీడజాడల డొంకి నిలిచెఁ గొన్ని
మధురసప్రస్నిగ్ధమాక్షికచ్ఛత్రభాగవులలో గవులలో నడఁగెఁ గొన్ని
కలనైనవిఱుగెఱుంగనిపోటుపరికరాచూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని
చేసేఁతబడి తలంచినలేను బంతి యవ్వలుపకొమ్ములదాడిఁ బఱచెఁ గొన్ని
తే. త్రాసమునఁ బొంది పద్ధతి భ్రంశనముల, గూపకుహరాంతరంబులఁ గూడెఁ గొన్ని
యిరులు తప్పరు లన నవ్వడేమిచెప్ప, రాజు బరచక్రహరణసంరంభుఁ జూచి 239

సీ. ప్రాయమింకినవాలుపాలింప్ల వెయాం డ్రు పసుపుపుట్టిక మూలఁబడి కృశింప
నేపురేగినరంకు టెలదీఁగబోఁడులు వింతకాఁగిలిలేక వెతలఁబొందఁ
కడిపోనితెరనాటకపుటూరుజంగాలు కేళికల్ గూడ కోగిరము తెత్త
తడక ద్రోపరిమ్రుచ్చుపాయువులు మఱి దొంగపనిచుక్కవాలైనఁబస్తుపొరల
తే. గంటవేఁటల దిరుగాడుకఱుటెఱుకు, మూఁక వెఱజిక్కి కాళ్ళ మోములనువాపఁ
బిండిచల్లినచందానఁ బేదవారి, దివియవెన్నెల సాంద్రదీధితి వహించె. 240

సీ. చేఁపుపుట్టినగభస్తికలు ముక్కులఁ గ్రుచ్చి త్రచ్చి యూరటలేక త్రోలుఁ గొన్ని
యట్టులానఁగఁ ద్రావి యసుపుచ్చరణపుఁ జోటుచాలక నేలఁ జూచుఁ గొన్ని
కడుసిగ్గుకేరుతొల్పడుపుదోమటఁ జొక్కి యానందమున జిందులాడుఁ గొన్ని
నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంతసించుఁ గొన్ని
తే. యోలములడాఁగి తలచూపనోడి తల్ల, డించు నరికోటిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁబట్టించి పేరెము లార్వఁగొన్ని; కైరవాప్తాతపములఁ జకోరకములు. 241

వ. ఆసమయంబున. 242

సీ. కట్టినజినుగుసిర్కావిధోవతి పింజయాపార్ష్ణిలంబియై యతిశయిల్ల
నౌత్తరీయవస్త్రములోను శుభ్రశుభ్రంబులై బ్రహ్మసూత్రములు మెఱయఁ
గనకపీరుద్గ్రంధికలు కపోవాలావాలసీమబచ్చనిడాలు చివురువెట్ట
నామోదరసపుష్టి నచ్ఛిద్రమై ఫాలతలమున గోపిచందనము గ్రాల
తే. నవటుతటఖేలనంబున నమరుబిళ్ల, సికచోకాటంబువిరులతోఁ జెలిమిసేయ
నడుమ జగజంపుదోఁపుఁబచ్చడము దనర, వైదికబ్రాహ్మణుఁడు నిండువన్నె మెఱసి.
తే. క్రముకభంగపరంపరాకలితముఖున, వన్నెతికతిత్తిమేఖలావల్లి నిజేకి

యాకు లర్థించి యలబలం బడఁగు టరసి, యునికివెలువడి బ్రాహ్మణుం డొక్కరుండు.

ఉ. అప్పు డధిజ్యచాపధరుఁడై మరుఁ డేర్పడి వెంటనంటి రాఁ
జొప్పున జాలిమాలి యఘోరుఁడు పాంథుఁడు వచ్చివచ్చి యా
యొప్పులకుప్పరామికి నయో విధియం చుదితాశ్రుధారలుం
గప్పఁగ మోహనిశ్వసనకంపితచారుతరాధరోష్ఠుఁడై. 245

క. చెదరెడిమేనును జెమటన, గదిసినకెంగేలు గ్రాలఁగా విప్రుఁడు తే
నిదురెఱుఁగనికంటంబడి; యదియగుమయమంట మంటపంబున నుండెన్. 246

ఆ. చీమ చిటుకుమన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న, నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుం డాలించు, నప్పు డబలకాలిచప్పు డనుచు. 247

క. రాదాయెఁ జూచితే యను, రాదా యడ్డంకిబట్టి రాదను నిర్మ
ర్యాదలు సీమంతినులను, హా దైవము ప్రొద్దుపోయె నని తలయూఁచున్. 248

క. ఎదురుకొన నలిగి చాయను, గదలుతలారులకు వెఱచి క్రమ్మరు నేన
మ్మదవతికి నేలదాదులు, పొదవికొన న్నిదురపోయెఁ బొమ్మని పలుకున్. 249

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీగీర్వాణుండు చలితవియో
గిప్రాణుం డగుపంచబాణుం దలంచి. 250

మ. ద్విజరాజుం దలదాల్చుకొన్నతనిదృగ్లిప్తిప్రభూతాగ్నులన్
రజమై పోయిననిన్ను నీతిరసదూరా మార యీకేవల
ద్విజరా జల్గిన నేమిసేయునో ప్రశాంతిం గాంతి మత్సాయక
వ్రజముం గూర్పకు నారి నారి ననుగూర్పం దేర్పఁ బుణ్యంబగున్. 251

చ. శివ గణనాయకా యనిన శీఘ్రమె కార్యము లడ్డపాటులే
కవు యనునాథపంచవిశిఖా యన హస్తపదాస్థికాండముల్
చివికెడువట్టినొప్పు లొడిసె ల్రసపాక్కులు గంట్లు బిబ్బపుం
డ్లవు నిటువంటిపుత్త్రుఁ దగవా కన నమ్మధుకైటభారికిన్. 252

వ. అని పనివి పనివి యనంగబాణమూర్ఛితుండుంబోలె నమ్మంయుండు నిద్రాముద్రా
లోచనుం డయ్యె నయ్యవసరంబున. 253

క. ఆనిశ ధరణీసురునకుఁ, దా నిచ్చినమాటపట్టుదలఁచి తదీయ
స్థానీయపాలవీక్షా, ధీనాకృతిగాక నగ రతిత్వర వెడలెన్. 254

క. జలధరమాలికలోపలి, తొలుకార్మెఱుఁగనఁగ యమవిధుంతుదహాలా
హాలకాచమేచకద్యుతి, గలనీలాంబరము ముసుఁగుగాఁ గైకొనుచున్. 255

క. పరివృత్తకంఠయై దిశ, లరయుచు నడ దడవడంగ నరుదెంచి ధరా
సురు నిద్రపోయె దే యని, కరసంజ్ఞం దెలుప మేలుకని వాఁ డంతన్. 256

వ. ఆదిత్యోదితుండై క్రోధించి. 257

శా. అయ్యో నేఁడిట కేఁగుదెంతువని నీ కాశించి యిచ్చోట గ
న్మొయ్యంజాలక నిద్రగాచి యిపు డేమోకూర్కితి న్మాకుజా
లయ్యె న్మాలవజాముఁజొచ్చె దడవాయె న్వచ్చి విచ్చేయుమీ
పయ్యాటం బికఁజాలు రోసితి ననుష్ఠానార్థినై పోయెదన్. 258

చ. కడువడి రెండుజాము లరుగం బరిరంభణ మీఁదలంచి నీ
కడ కరుదెంతు రానిపనిగల్గిన నాఁటికిఁ దండ్రిఁ గాశిలోఁ
బొడిచిన క్రూరకర్మమునఁ బోవుదు నంటివి సూనృతంబు నీ
కొడుకయి పోయె రాక కిదిగో గురులింపజరాత్రిపాపముల్. 259

క. కడుసరసములకుఁ బ్రొద్దై, క్కడిది దురంతోపగూహాగతులకుఁ బ్రొద్దె
క్కడిది యొకసెలవు సేసితె, కడజామున వచ్చి చాల్పొకాఱుకుబుద్ధిన్. 260

ఆ. కొదవలేక రతుల గోవాపుఁగోడెనై, పొదలఁ బెద్దతడవు ప్రొద్దులేమ
నోరసి తెడ్డు నాఁకి యుపవాసకర్మంబు, చెఱుచుకొనఁగ దీనిచేత నేమి 261

క. అని చిందరేఁగిన ట్లచ్చెనఁటిఘరాసురుఁడు చెంతఁ జేపడిననిధి
న్మని గాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బాసి యుబ్బగాఁడుగఁ బోయెన్. 262

క. చనఁ దనకు మనసునచ్చిన, పనియది గాకునికిఁ దీరఁ బట్టక చనుఁ గా
కని యూరకుండె నట్లుం, డి నరాధిపకన్య దనదుడెందములోనన్. 263

క. సరిప్రొద్దున నరుదెంచితి, నరుణోదయసమయ మెట్లులయ్యె దురంత
స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్. 264

క. కామాంధోపి నపశ్యతి, నా మును నే విన్నదానన కదా వెఱఁగే
లా మందునిమాటలకని, యాముద్దుగుమ్మ మందహాసముఁ దాల్చెన్. 265

క. నానీరచరాగ్రణి బహూ,మానున కిట్లనియె నట్లు మహీసురుఁ డన్య
స్థానస్థుఁ డయినపిమ్మట, నానెలఁతుక యేమిసేసె ననఁ గపి పలికెన్. 266

క. మహీసురుఁ డట్లరిగిన న,మ్మహిళారత్నంబు తోడసుమాలితి నని దు
స్సహరయమున భయమున నిజ, గృహమునకుం బోవఁ దత్తిరింపఁగ నంతన్. 267

చ. ఘనదసమృద్ధి నీలికడవంబలె నంబరమొప్పఁ జంచలల్
మినమినలీన దోన నుఱిమె న్వడి గండులు వ్రాలె వ్రాలెఁ దొ
ల్చినుకును దూర్పుఁటీదరొలసెం బలసెం జడివానసోనజో
రనఁ బుధవిద్విషద్గళసహస్రభవాకృతిఁ బర్వెఁ జీఁకటుల్. 268

క. ఇది రాయితప్ప పల్లం,బిది మిట్టిది మానుమట్ట యిది పామిది గా
మిది యని వివరింపఁగఁ బె,ట్టిదమై యొప్పెసఁగు నక్కటికిచీఁకటిలోన్. 269

చ. సుడిసుడి యింటిత్రోవ యనుచుం బెరచోప్పునఁ బోయిపోయి యా
ప్పుడఁతి దృషద్వతీసరిదుపాంత దురంతవనాంతరంబులం
బడి ముళుదీవలుం దవిలి భంగములై కురులుం దుకూలముం
దొడిపినకంచుకం బెడలఁ దొట్టినభీతి నొడల్వడంకఁగాన్. 270

క. ఈరము లూఱట నొందక, దూఱుచు నో రలయ వలువ దూఱుచు రొంపిం
జాఱుచు నెంతేవెలవెలఁ, బాఱుచు రాజన్యకన్య పఱచి యలంతన్. 271

శా. ఆయుగ్రాటవి నొక్కచోట భయదంబై తోఁచురక్షోవట
చ్ఛాయం బీనుఁగుఁ ద్రొక్కి కోమలకరాబ్జాతంబునం బట్టి య
య్యో యీమానవుఁ డెవ్వఁడో కో మృతికేమో హేతు వంచు న్విచా
రాయత్తం బగునాత్మఁ బోఁ దెరువులే కచ్చోటఁ దా నున్నెడన్. 272

క. ఆవటమునఁ ద్రింశద్వ, ర్షావధిగా నున్నభూసురాసురుఁడు విశా
లావరపుత్త్రికి హితసం, భావన సాక్షాత్కరించి పలికెం బ్రీతిన్. 273

క. మనుజులు మిట్టాడని యీ, ఘనగహనంబున నిశీథకాలమునం జ
చ్చినయటుచక్కటి తెక్కటిఁ, దనుమధ్యా సంచరించెదవు నిశ్శంకన్. 274

తే. ముంచు కన్నీరు మంచున మోమువన్నె, వాడియున్నది దీర్ఘనిశ్వాసనిహతిఁ
దల్లడిల్లెడునధరోష్ఠపల్లవంబు, ఇంతవలవంత నవ్వ నీ వెవ్వ రనుచు. 275

క. అనుమానింపక తనుభృ, త్తనువిసర వపారసప్రదానవిధాన
స్వనముల్లుకంబు వదనం, బున ద్రిప్పుపలాశి కిందుముఖి యిట్లనియెన్. 276

క. వినయవిశాల విశాలా, వనిపాలునిపుత్త్రి దైవవశమున నస్మ
జ్జననీజనకుల జనకుల, వినతులపా త్తెడసి యాటవికసతి యయితిన్. 277

శా. ఏ నిత్సేనుట యెట్టు లీపడినవాఁ డెవ్వాఁడు వర్షాతపః
పౌనఃపున్యముఁ దెల్పినట్లు చపలాప్రత్యర్థు లాలోకముల్
మేన భ్రంలివా ముగ్రమృత్యుముఖగంభీరంబునో రెవ్వర
య్యా నిన్నూచిన గుండె ఝల్లురనుఁ దథ్యం బానతీవే యనన్. 278

మ. అతఁ డత్యంతతమప్రసన్నహృదయుండై పల్కె నే నంచిత
శ్రుతిసంపన్నుఁడ బ్రహ్మరాక్షసుఁడ నిచ్చోఁ గాపురం బుండుదున్
మతి భీతిల్లకు నీకు నొజ్జ లిత్రఁ డమ్మా నీకు నేకారి యీ
క్షితిజచ్ఛాయ మనోజబాణహతి నొచ్చె న్మాట లింకేటికిన్. 279

క. గురుఁడ నిది శిష్యురా, లీతరుణీమణి గవయ దుష్కృతం బని మదిలో
నరసి యెఱుంగనియాద్విజ, నరపశువుల మేలుపొందునా యొందైనన్. 280

క. సూరిశ్రేష్ఠునకు వరా, చారగరిష్ఠునకు నీకు సద్విప్రా యీ
ఘోరనిశాచరవేషం, బేరూపునఁ గలిగె ననిన నెఱిఁగింతుఁ జెలీ. 281

సీ. మొదల గౌశాంబి నుండుదు వేదశాస్త్రార్థచతురుండ నాపేరు చండశర్మ
కులకాంత శాంత యచ్చెలువతమ్ముఁడు మూలఘుటకాంకుఁడతఁడొక్క-కన్యఁ బెండ్లి
గాఁబోవుటయు గోడిగములకు నేనును బనిబూని యాటువాని ననుసరించి
యతిసభ్యునట్లు పోయితిఁ బోవ నను బెండ్లిపెద్దగాఁ దలఁచి యావిప్రతండ్రి
తే. కదిసి యల్లునిగుణరూపగౌరవములు, వేఁడుటయు నావివేకంబు వీటిఁబోవ
నవగుణంబులప్రోవు మూర్ఖాత్ముఁ డంటి, ననిన నమ్మాట లెఱిఁగి సత్యములుఁ జేసె. 282

క. కాతాళంబున నిచ్చిన, కూఁతు నతం డీక వడలఁగొట్టిన నప్పుడా
చేఁతకు నాహృదయం బుత్ప్రాతఁ బ్రేంఖోళనప్రయోజన మాసెన్. 283

క. మఱఁది యని యుబుసుపోకల, నెఱుఁగక యిట్లాడి లోకు లెగ్గింపం దెం
పరినై కూడినపెండిలిఁ, జెఱిచితి నాకన్నఁ గష్టశీలుఁడు గలఁడే. 284

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నయో హృత్ప్రతీపపరితాపశిఖిం
గాయము వేఁగెడునని పల, చేయి కపోలమునఁ జేర్చి చింతిలుచుంటిన్. 285

చ. అగణితధర్మకర్మరతుఁ డంచట ము న్నరుదెంచియున్నవాఁ
డగుట మదుగ్రకృత్యమును డాఁచి ముద్గలనామతైర్థికుం
డగలక నన్నుఁ జూచి కుటిలాత్మ కళత్రసహోదరున్మహా
సుగుణధురీణుఁ గాని మనుజుండని యూరక పల్కఁబోలు నే. 286

ఆ. వేయుబొంకి పెండ్లి సేయుదు రత్తను, జను లతిప్రయాసమునకు నోర్చి
చెనఁటినేఁత నిట్లు మనువులఁ జెఱిచిన, విసపువిత్తుఁ జెప్ప వినఁగఁ గాని. 287

ఉ. మోఘముగాక నీవు తలమోచియొనర్చిన యట్టియుద్ధురం
తాఘము నేఁడు పిల్లికొలదైయె చరణంబులఁ బ్రాఁకుసజ్జన
శ్లాఘనయోగ్యభూమిసురజన్మము వీడ్కొని కానలోగ్రశా
ఖాఘనవృక్షవర్తివయి క్రాలునిశాచరవేష మేర్పడన్. 288

ఉ. వంకరకట్టెకింగలము వైద్యము నీకిది వోలునంచు ని
శ్శంకనవృత్తి ముద్గలుఁడు శాపము నిచ్చిన శోకబాష్పధా
రాంకితనేత్రపంకజుఁడనై చరణంబుల వ్రాలి యోదయా
లంకృతచిత్త యోబుధకళానిధి యోగుణధుర్య కావవే. 289

చ. అనుఁగుమఱంది గానఁ బరిహాసపురస్సరభాషలాడ నీ
పనిజనియించె నీచరణపంకరుహంబులు సాక్షిగా మదిం

గనలు వహించి యిట్టికొఱగాని ప్రయోజన మాచరింప నీ
యనుపమదివ్యదృష్టి కొకఁ డడ్డమె చూడుము నేర్పునేరముల్. 290

క. అని యేను మేను వడఁక, న్వనితాజనతార్తిఁ బొగల వారించి ప్రబో
ధనిరీక్షణములసర్వముఁ, గనుఁగొని యితఁ డనపరాధిగా యని శాంతిన్. 291

వ. ముద్గలుండు న న్నాలోకించి యిట్లనియె. 292

చ. కెలసముఁ బూని పెండ్లిపనికిం బ్రతికూలుఁడ వైతి విట్లు మొ
క్కల మిదిగాదె నీమన స్సకల్మష మానటులైనఁ గేవలం
బుల కిది చోటె మోఘమయిపోవదు నావచనంబు గన్నచా
యల నిఁక బ్రహ్మరాక్షసుఁడవై యిల నీవు చరింపుచుండఁగన్. 293

ఉ. అల్లినవంతమూలఘటకాంకుఁడు భూమినిలింపకన్యకా
హల్లకభల్లభగ్నహృదయస్థలుఁడై తను పుజ్జగించి మ
త్పల్లిన కుద్భవించుజయసేనుఁడు నా నవవిప్రకన్య యు
త్ఫుల్లసరోజనేత్ర ప్రియపుత్రిక యై పొడము న్సుకీర్తికిన్. 291

ఉ. ఆయెలనాగ దైవగతి నర్ధనిశం గతిదప్పి నీతరు
చ్ఛాయకు వచ్చు నాసరసిజచ్ఛదనేత్రకు నవ్వసుంధరా
నాయకసూతికిం దగులొనర్పుము సంశయమేది యంతలోఁ
బాయుమహీసురాసురత బ్రహ్మపదంబు భజింతు పిమ్మటన్. 295

మ. అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోవం బోవ నాలోన నె
త్తని గ్రుడ్లుం గులిశంబులుం దెగడుకోఱ ల్బాడబస్ఫూర్జితా
ననముం జుంజురువెండ్రుకల్బుదకర్ణద్వంద్వముం గల్గి మే
దినికి న్వ్రేగుగ బ్రహ్మరాక్షసుఁడ నైతిం జంచరీకాలకా. 296

వ. అట్లుర్వీపూర్వగీర్వాణుండనై సకలప్రాణిభక్షణంబునఁ గౌక్షింభర్యంబు ప్రవర్తిల్ల నివ్వటవి నాశ్రయించి యుండితి నిప్పటికి ముప్పదిసంవత్సరంబులు గడచె న మ్ముద్గలుండు చెప్పినట్లు నామఱంది జయసేనుండై పుట్టె నవ్విప్రకన్యకవు నీవు నిన్నన్నరనాథకుమారునకుం బరిణయంబు సేసి యాసురం బగు నివ్వేషం బపనయించెద ననుటయు నలరుమొగంబున రాజన్యకన్య భూసురాసురున కిట్లనియె 297

క. ఇచ్చోట నానిమిత్తము, వచ్చిన యవ్విప్రు సుప్రసన్నత్వము నేఁ
డచ్చుపడ మనిచి పురికిం, బుచ్చి జగద్వినుతకీర్తిఁ బొగడొందఁగదే. 295

క. భూసురహత్యాఘమహా, త్రాసమునకు వెఱతునని పదంబులఁ బడి గా
ఢాసక్తిం బ్రార్థించిన, నాసురకులశాత్రవుఁడు దయాభిముఖుండై. 299

ఉ. ఆవిరితీవబోఁడికృప కద్భుతమంది భవన్నియోగ మే
లావృథయా ఫలింపక బలాయబలా యని విప్రుఁగొంచు ర
క్షోవిభుఁడేగి పీనుఁగున సుప్రదతీర్థమునం దొరల్చి సం
జీవితుఁ జేసి మందిరముఁ జేర్చి భజించి కుమారి కిట్లనున్. 300

క. చనిపోయిన నీయొజ్జలు, మనుగడఁ గనియె న్వసించె మందిరమున నో
తనుమధ్యా మొగిడించిన, కనుఁగవతో నిలువు రాజుకడ నినుఁ జేర్తున్. 301

చ. వలదు విలంబ మన్నఁ బ్రతివాక్యము లాడక మోడ్పుకంటితో
నిలిచిన బ్రహ్మరాక్షసుఁడు నిర్భరవేగధురాధురీణుఁడై
పొలఁతుక నప్డె యెత్తుకొనిపోయె మనోజవుఁ డొంటి నిల్చెఁ బా
టలనగరోపకంఠనిబిడద్రుమకాంచనసౌధవీథికన్. 302

వ. ఆసమయంబున. 303

శా. గొందు ల్వీడ్కొని పక్కణాంతరకుటీకూటాధ్వసంధు ల్వరా
స్కందు ల్వ్రాడ నవక్రచక్రములు మచ్చ ట్లాడ నిచ్చాగతిన్
గ్రిందు ల్మీఁదులుగా సతీపతులు గౌఁగిళ్ళూడ దీప్తద్రిక
ల్పొందుల్ గూడఁ ద్రిభంగిభంగి మొఱసెం బుంస్కుక్కుటవ్రాతముల్. 304

చ. అతికృతికన్య నందినమురారివిరాజదనంతభోగసం
స్థితి ప్రతివారముం బొదల శిష్యులు పుణ్యజను ల్జయక్రియో
న్నతులు దురంతశాస్త్రకలనం బ్రతివాదుల నోర్వ సర్వతో
గతమతికుందు నిల్చెఁ గవికౌశికదిక్కటకాగ్రపీఠికన్. 305

చ. వరవసులక్ష్మి నుల్లసిలువారికి నేమిగొ అంత యీవిభా
కరునకు సంజనిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టిదో
నెరవులసొమ్ము సత్యమగునే యని వెల్వెలనయ్యె నహ్నినాఁ
బరిగళితద్యుతి న్వెలకఁబాఱె నిశాంతనిశాంతదీపముల్. 306

చ. కనుఁగొని చైత్యనిత్యపథికప్రవిబోధకరంబులై ఖగ
స్వనము లుదగ్రబాహ్యవనవాటికల న్వినవయ్యె నయ్యెడన్
ఘనమదభృత్తమఃకరటికంపితదిగ్వటపస్ఫురన్నభో
వనరుహసంక్షరత్కుసుమవర్షముచాడ్పున జాఱెఁ జుక్కలున్. 307

సీ. ధారాధరస్మయోదయవియచ్చికురబంధమునఁ దారాలతాంతములు రాలె
రోదసీతనుసమారోహాంధకారైణమదవిలేపనరేఖ మసలిపోయెఁ
జక్రవాకస్తనస్థాత్మనీహారఘర్మాంబువు ప్రత్యక్షమై యడంగె
మధుపకజ్జలభాసమానకైరవలోచనముల నిద్రాముద్ర ననలు పెట్టె

తే. మలయనిలయసుగంధసంబంధమంద, పవననిశ్వాసవీచిక ల్పొరుదీరె
సంప్రభూతకళారమ్యసౌమ్యగమ్య, గంగసంగశ్రమాయామయామవతికి. 308

చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు గౌఁగిలింతలం
బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములు న్భరంబునన్
దిగిచినసొమ్ములు న్మదవతీతిలకంబులచేత వేఁడున
న్మగుడ సపర్యఁ గైకొనిరొ మాన్యులు గారె గుణప్రదీపకుల్. 3.9

చ. కవిసి కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచి లోఁ
జివికెడువారు హస్తములజీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరుల మోవులాని యరగన్నిడువారును శయ్యలం బరా
భవ మొనరింపలేక వగవాల్పెడువారును సైరి జవ్వనుల్. 310

శా. నానాదీపమరీచికల్ గొనియెనో నాఁ జూడ నిద్రాపరా
చీనస్త్రీనయనంబులం బ్రియదృఢాశ్లేషప్రకుబ్జీభవ
న్మీనాక్షీకుచము ల్దిగం కనికరామ్రేడీకృతోత్క్రాంతకాం
తానుష్ఠాధరము ల్జపాసుమము చెన్నారె న్నిశాంతంబునన్. 311

మ. తులనప్రేమరసోల్లసన్మిథునచేతోజాతసంగ్రామకాం
క్షల వారించె నుషఃప్రసూచకగతుల్ శాలాజరద్దీపికా
కళికల్ శైత్యదృఢస్తనస్తబకముక్తాహారము ల్వాసనల్
గలయం జల్లెడుపూఁత లిప్తరుచికృత్కర్పూరతాంబూలముల్. 312

సీ. శ్రమవార్నిమజ్జనజటిలాలకంబులు సంధూతకుంకుమస్థాసకములు
జాగరారుణితలోచనసరోజంబులు కాంతచుంబనముక్తకజ్జలములు
కరచపేటనిరస్తకరినక్రచిత్రంబు లభినవదిగలంకృతాధరములు
సృణినమత్కరికాభరణభృద్గళంబు లనూనవిద్రాముద్రితాననములు
తే. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, గురుపయోధరభరహారకువలమణులు
కలితతాంబూలరసరక్తగల్లతలము, లమరఁ గొమరాండ్రు పొలిచి రహర్ముఖమున.

శా. ఆశాఖడ్గమిళత్తమోమలినహృత్యర్థంబు నిర్వంత్యసం
ధ్యాశిల్పిప్రభుకల్ప్యమానకురువిందక్షోదసమ్మిశ్రలా
క్షాశాణం బనఁ బ్రాచిదోఁచె బిసినీకాంతుండు జాగ్రత్పురో
దేశాంగారకరాజినాఁగ మొదలం దీండ్రించె సంధ్యాప్రభల్. 314

సీ. ప్రసవితద్యుక్షేత్రఘుసృణసస్యంబులు హల్లకప్రియసాలపల్లవములు
తిమిరేంధనప్రవర్ధితదావశిఖలుషఃపవనభుగ్వ్రాతభోగఫలకమణులు

హారిపురంధ్రీకుసుంభాంబరంబులు ఘనప్రాక్పరిత్రాడ్జటార క్తిమములు
గంభోళిఖండితోదయపక్షరుధిరంబులై రావణాంగసింధూరరజము
తే. లక్ష్మీనృత్తిప్రమోదకృద్యామినీవి, యోగదవధూవ్యథాతిఖినో్మదురమణి
నవ్యహల్లకతల్పము లొప్పఁ జెలంగె, నంబరంబున నపుడు బాలాతపములు. 315

ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబునిధి కేగుచెడం దగ వారక న్మయూ
ఖమ్ముల నెన్నికం దవితముగా నొనరించిన ప్రేక్షర క్తిలోఁ
గ్రమ్మఁగఁ బ్రాక్పరివృద్ధరవిరశ్ములఁ బద్మినివేగుపాటునం
గ్రమ్మఱ లెక్కఁ బెట్టె ననఁగా వికసించె సహస్రపత్రముల్. 316

ఉ. గాసిలి రాజు మన్ననలు గాంచిన నే నొరుఁ జూడ నంచు క
న్మూసినభంగిఁ గైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగవనవహ్నిసముత్థితధూమరాజులో
నా సరసీజగర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్. 317

తే. ఇట్లు సూర్యోదయంబైన నేకతమున, బ్రహ్మరాక్షసుఁ డద్ధరాపాలుఁ గదిసి
పూర్వవృత్తాంతమంతయుఁ బొసఁగఁ జెప్పి, యబ్జముఖిఁ జూపి పెండ్లిగమ్మనుమనిచ్చె.

వ. ఇచ్చిన. 319

క. ఆరామామణిఁ గైకొని, యారామరుఁ డావరార్పితాతిథ్యంబై
యారామన్యగ్రోధధ, రారుహసౌధమున బ్రహ్మరాక్షసు నునిచెన్. 320

క. ఉనిచి ప్రణమిల్లి క్రమ్మఱి, చని యవ్విప్రాసురవరు సరసాన్ననివే
దనవిధికిఁ బుణ్యభూసుర, జనుల నియోగించె జనితసౌహార్దమునన్. 321

ఉ. కూరిమి తండ్రిపాదములకుం బ్రణమిల్లి సుకీర్తికన్య నం
భోరుహలోచన న్భువనమోహినిఁ జూపి ధరామరు న్నిశా
చారుచరిత్ర మేరుపడ సర్వముఁ జెప్పినఁ బుత్రు మెచ్చి యా
ధీరవరుండు బంధుపృథివీసురులం బిలిపించి యిట్లనెన్. 322

సీ. ఘనులార మనవసంక్తిస్పర్శసంబంధి గాఁడె సుకీర్తి విఖ్యాతమూర్తి
దైవయోగమున నాతనిపుత్రిఁ గాంచనప్రతిమానగాత్రి చేపడియె మనకు
మనజుసేనకుమారున కాపూర్ణశీతాంశుముఖిఁ బెండ్లిసేయవలయు
లాలన నవ్విశాలానాథుఁ డిచటికి వచ్చినఁ జుట్టంపువరుసగాదె

తే. యతుల నయమార్గరతుల దండాధిపతుల, ననిచి రప్పింతమా యమ్మహామహుంబు
నతఁడు వీక్షించుఁ గాక న న్నాప్తమిత్రు, లుచితమికార్య మొనరింప నొప్పుననిరి.

క. నావిని మత్సిల్లుఁడు హా, లావీక్షితపతిగంత్రుల న్మంత్రుల సం
భావించి పనుపుటయు న, వ్వావనచుతు లరిగి వినయపాటవ మమరన్. 324

సీ. రోహిణీవిరహాభీరుక్షపాకరబింబ మన ఘనగ్లానదీనాస్య మమర
నొడలునిండారి వెల్వడినశోకరసంబుతీరున వేఁడికన్నీరు దొరుగ
మెఱుఁగుటద్దపుబిళ్ళమీఁదికెంపులతెరక్రియ గపోలమునఁ గెంగేలు మెఱయ
నతిపురుచ్ఛలమానలతభంగి నిశ్వాసధారచంద్రిక మోవి దల్లడిల్లఁ
తే. దనయ నీలోన లేదుగదా ధరిత్రి, చూపుమా యంచు ప్రార్థించుసోయగమున
దగ శిరము వంచి తనలోన దానపలుకు, మనుజపతిఁ గాంచి ప్రణమిల్లి మంత్రివరులు.
క. నతులై వినయవిచారో, న్నతులై నిలుచుటయు వదననలినములఁ దరం
గితదృష్టిచంచరీక, ప్రతతులు నటియింప ధరణిపాలుం డనియెన్. 326
క. అరుదెంచితి రెవ్వరు మీ, రరుదారం జెప్పుఁ డనిన నలికతటాంత
స్ఫురదంజలిపుటులై య, న్నరనాథుం జూచి దండనాథవతంసుల్. 327
మ. క్షితినాథోత్తమ నేఁడు నీమఱఁది మత్సిల్లుండు పుత్తేర వ
చ్చితి మాలింపు తదీయభాషితము లస్తేయవ్రతబ్రాహ్మణ
క్రతుభుగ్వైరివంతసయోగమున నీగారాము నెచ్చెలి యొం
డితరక్షోణికిఁ బోకచేరె మము నీ వీక్షించి పోరాఁ దగున్. 328
క. అని దేవరతో విన్నప, మొనరింపం బంపె విక్రమోపేతపతా
కినితో సంబంధిపురం, బున కరుదెం డనిన భూవిభుఁడు సుముఖుండై. 329
వ. అమ్మంత్రులకుఁ బసదనంబులిచ్చి యంతఃపురంబున కరిగి యింతికి నంతయుం దెలిపి
విన్నయాదిప్రొద్దుగా సభార్యుండై చతురంగబలంబులు గొలువ వచ్చి సుకీర్తిమ
ధ్యాహ్నకాలంబునకు బాటలీపురోపకంఠంబు గదిసె నప్పుడు. 330
ఉ. ఇంకనిరీవి బౌవ తనయింటికి వచ్చినఁ జంద్రసేనుఁ డ
భ్రంకషసమ్మదాభ్యుదయభాసురుఁడై యెదురేఁగుదెంచి ప
ల్యంకిక నున్నయప్పచరణాబ్జములం బడి కాంతకాంతియు
త్పంకజరాగపూగకృతధామకవీథికిఁ దెచ్చె దెచ్చినన్. 331
ఉ. ముందఱ నేగి యబ్బువనమోహిని వాహినిపోలె నుబ్బునం
తం దలచుట్టు కన్దొగల దట్టముగాఁ బ్రవహించునశ్రువా
రిం దులితేతరస్తనశరీరములం దిగుపారఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెరతో మొగమెత్తి కేడ్చినన్. 333
సీ. కడుపులోఁ జేపెట్టి కలఁచిన ట్లగుటయు భక్తిఁ గూరిమిపట్టిఁ బట్టి యెత్తి
శిర మురంబునఁ జేర్చి చెఱువు ప్రస్సినరీతి నోడి కట్లట్టి పెల్లుఱులు నశ్రు
ధారల నతితాంతదశఁ గన్నతనువల్లి వడఁకుచు గద్గదధ్వానలీల
భాషణంబుల నెంతపనియయ్యె నట్లుండె విధికృతం బనుచు నుర్వీవిభుండు

తే. గూఁతు నొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి నలినీట యాళిపాట
పాటలాధరవదనదర్పణముఁ గడిగి, యుచితకాంచనపీఠిఁ గూర్చుండె నంత. 333

ఉ. చిత్తము చెంగలింప జయసేనుఁడు సాఁగిలి మ్రొక్కె నన్మదో
న్మత్తవిరోధిరోధిరుచిమద్ఘనమూర్తి సుకీర్తి కీర్తిమై
నెత్తి కవుంగిలించె నపు డింపెసలారఁగఁ జంద్రసేనుఁ డు
ద్యత్తరసత్యభాషణవిధానుఁడు బాలకు మ్రొక్కి యిట్లనున్. 334

క. దళితారి నీకుమారి, న్మిళితాంగవిలాస మైనమేనల్లున కీ
వలదే యిపుడని బద్ధాం, జలి యై ప్రార్థించుటయుఁ బ్రసాదోన్ముఖుఁడై. 335

వ. బ్రహ్మరాక్షసోద్యోగంబును బాంధవ్యంబునుం దలంచి సుకీర్తిని వర్తమానలగ్నంబున మిథ్యావలగ్నజయసేనునకుఁ బెండ్లిజేసెద ననియె నమ్మహోత్సవంబు వీటఁబాటిలి ననాగతసంబంధిబాంధవంబును నాయాతశైలూషశైలూషంబును నాగచ్ఛదఖిలావనిపనికరంబును నాహూతబ్రాహ్మణజాతంబును నాబద్ధశుద్ధమాణిక్యతోరణంబును నలంకృతవిపణిమార్గంబును నభిరచితరంగవల్లీమతల్లికంబును నారాధితనవగ్రహంబును నఖండవాద్యమాననానాతూర్యంబును నై యమ్మహామహంబు ప్రవర్తిల్లె నాసమయంబున. 336

ఉ. బంగరుపీటఁ బెట్టి దడివంబిడి రాజకుమారి దానిమీఁ
దం గదియించి తూర్యనినదంబుల రోదసి ఘూర్ణిలంగ తీ
విం గడుపాటిపాట నరవెంద్రుకలం గొమరౌసువాసినుల్
చెంగట నక్షతంబు లిడి చేఁడియకుం దలయంటి రాదృతిన్. 337

క. సుమతైలప్లుతి నలరా, కొమరాలికి నలరెఁ గురులు కోకనదాంత
స్స్వమధూళిమగ్నమంద, భ్రమరీసమరీతి నయనపర్వము లగుచున్. 338

తే. బుగులుకొనుతావిసిరము కప్పురముతోడ, పడుపుదివ్వనిఘుసృణద్రవంబుతోడఁ
బొందుగా మేళవించినచందనంబు, నాఁతికొండొకకలకంఠి నలుగుఁ బెట్టె. 339

ఉ. అజ్జలజాక్షి వస్తుసుమహన్మతిమజ్జనశాలిబాలిక
ల్మజ్జనశాలఁ జేర్చి మణిమంజులపీఠముఁ బెట్టి దువ్వి పై
గొజ్జఁగినీరుచల్లి మెఱుఁగుల్గొన విప్పి విదిర్చి యొక్కచం
చజ్జఘనాంగ పెట్టె ఘనసారయుతామలకంబు నేర్పునన్. 340

ఉ. తోరపుజాలువాపసిఁడితొట్టెల నొట్టినపశ్చిమంబుప
న్నీరపరంజిబుంగలను నించి మనోహరకక్షకాంతిబం
గారువసంతమాడఁ గరకంకణఝంకృతు లుల్లసిల్ల హే
లారతి నార్చె నొక్కనవలా జలకం బలకంబుకంఠికిన్. 341

క. ఒకముగురు నిగురుగప్పిన, ప్రకటాంగారము లనంగ భస్మవిలిప్తాం
గకులు చను దేర నారసి, తుకతుకపో నడచె నాపితుఁడు చేసేతన్. 5

క. లగుడంబున మస్తకముల్, పగిలి పడ న్వ్రేయుఁ జచ్చిపడి రెన్నఁగ న
మ్ముగురును ముగురు నిధిత్రయ, మగుటయు లేదవని మెఱసె నస్రము మెదడుల్

వ. అట్టి దుష్కృత్యంబునకుఁ బౌరులాహాకారంబు లొనర్చి రాక్షణంబ నగరరక్షకులు. 6

సీ. పటురభసంబున న్బాదివిపట్టి దురాత్మక యిట్టివారి నేఁ
డిటువలె జేసి చంపుటకు నెవ్విధి నీమన సోర్చె నీవు ని
ష్కుటిలచరిత్రు లన్యులకుఁ గోర రొకింతయు గీడు వీరిపైఁ
గటకట మత్సరం బెటులఁ గట్టె వృథా యిది పోల దెయ్యెడన్. 62

క. నిటలలిఖితాక్షరంబులు, కుటిలాత్మ మనుజదెసల గొనబగుజటులం
జటులగతిఁ జంపితీవని, కటములు బొంగారఁ గ్రూరగతి వారంతన్. 63

క. ఆత్మకరకుఁ డోడిపడ న, బ్భృత్యులపాదముల సరసఁబెట్టి భుజాప్రో
తిక్షితి దునిమిరి ధర నప, రీక్షితకార్యులు భజింపరే యాపదలన్. 64

చ. ప్రశమనరేఖఁ బాదమునఁ బ్రామి యహో యవిశేషరోషసం
వశుఁ డగుచున్ ధరాస్థలి నవారణ నెవ్వఁడు వేగిరించి సం
భృశతరకార్యము ల్సలుపుఁ బెద్దయు వేయునునేల సర్వదు
ర్దశలు గలంచు వానిఁ దము దా గుణలుబ్ధులఁ బొందుసంపదల్. 65

వ. కావున నీవును నాపితునకు దోడుబోయినవాఁడ వని ప్రాణేశ్వరుం డూఱడి వారు సుఖస్థితి నుండి రని విష్ణుశర్ముండు సెప్పిన విని నీతికథావర్ణనంబున సుదర్శనకుమారులు లబ్ధవర్ణులై పూర్ణులై తంత్రి నలరింపుచుండిరి. 66

మ. సతతశ్రీభృతరాగదేహాకృతయోషాభాగరత్నాస్థిదా
మతటిత్తారకయుక్తవారిధరసమ్యక్కాయ చిద్గేయ వ
ర్ణాతమోహాన్వితికర్తృకామ హితగానప్రేమ గోపాంగనా
శతచామీకరచామరానిలచరాంచత్కాంబలోలాలకా. 67

క. హాటకమణినూపురనృక, రోటీకమలాప్తచరణ రుచిరాగ్నిశిఖా
పాటీరభసితపల్లవ, పాటలమందారపాదపప్రతిమానా 68

మాలిని. త్రిపురరిపుసరస్త్రీత్రిప్రమానచ్ఛిదాధీ, నిపుణతరవిహారా నిత్యసంతోషపూరా
జపకరణచణార్యాసక్తముక్తాభిగమ్యా, త్రిపటుతనువిలాసా దివ్యధామైకవాసా. 69

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదారసుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతం బయిన పంచతంత్రంబున నసమీక్ష్యకారిత్వ మన్నది సర్వంబును పంచమాశ్వాసము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.